























everest/547/PP tel

పాల్గొనండి




# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్ పాప పోటీలో

రు.10,000 రొఖ్ఖం బహుమతులు గెలవండి!



ఇవిగో కొందరు అందాలపాపల బొమ్మలు, కాని కొందరికన్నా మిగతావారు అందంగా వున్నారు. మీ దృష్టిలో వారివారి అందాన్ని అనుసరించి ఒక క్రమంలో ప్రవేశపత్రంలో తిరిగి అమర్చండి. అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్‌పై సులభమైన పోటీలో పాల్గొని గెలవండి. ఈబహుమతులు మీవే!

| | | | |
|---|---|---|---|
| మొదటి బహుమతి<br>రు. 2,500 | 2 రెండవ బహుమతులు<br>రు. 1,000 ఒక్కొక్కరికి | 5 మూడవ బహుమతులు<br>రు. 500 ఒక్కొక్కరికి | 10 నాల్గవ బహుమతులు<br>రు. 250 ఒక్కొక్కరికి |

ఇవిగాక సానుతాప బహుమానాలు 10 రు. 50 ఒక్కొక్కరికి

ప్రతి ప్రవేశ పత్రానికి అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్ అట్ట పెట్టె ఎదుట ఇంగ్లీషులో వున్న భాగాన్ని జతపరచండి. ఎన్ని ప్రవేశపత్రాలైనా పంపవచ్చు. మందుల షాపు లన్నిటిలోను మిగతా అమృతాంజన్ తయారీల అమ్మకందారులవద్ద ప్రవేశ పత్రాలు లభించగలవు.

ముగింపు తేదీ: 15 ఫిబ్రవరి '74

మీ ప్రవేశ పత్రాలను క్రింది చిరునామాకు పంపించండి:

అమృతాంజన్ లిమిటెడ్, 14/15, లజ్ చర్చి రోడ్డు మైలాపూర్, మద్రాస్-600004

OBM: 2674/TG

## ఫిబ్రవరి 1974 నుండి 'చందమామ' వెల రు. 1

దేశంలో అన్ని వస్తువుల ధరలూ అంతూ పొంతూ లేకుండా పెరిగి పోతున్నాయి. కాగితం ధర మరీ విపరీతంగా ఉంటున్నది. ఇది ఇంకా ఎంతవరకు పోతుందో ఊహించ శక్యం కాకున్నది. ఇటువంటి క్లిష్ట పరిస్థితిలో కూడా వెల హెచ్చించకుండా 'చందమామ'ను నడుపుకుంటూ వచ్చాము. కాని ఇప్పుడు తప్పనిసరి అయింది. అందువల్ల ఫిబ్రవరి '74 సంచిక నుండి ఒక్క పది పైసలు మాత్రం అధికంగా, 'చందమామ' వెల ఒక రూపాయి చేస్తున్నాము. ఈ చిన్న మార్పును మా పాఠకులు, అభిమానులు, ఏజంట్లు సంతోషంతో ఆమోదించి, ఎప్పటి లాగా మాతో సహకరిస్తారని నమ్ముతున్నాము.

పబ్లిషర్లు



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

అన్ని వస్తువుల ధరలతో బాటు కాగితం ధర కూడా విపరీతంగా పెరిగిపోయింది. కాగితం కొరత కూడా ఇందుకు తోడయింది. ఆ కారణంచేత ఇప్పుడు అనివార్యంగా చందమామ ధర మరో పది పైసలు పెంచి, రూపాయి చెయ్యవలసిన పరిస్థితి ఏర్పడింది. అందుచేత ఫిబ్రవరి నుండి చందమామ ధర రూపాయి చెయ్య నిర్ణయించాము. ఈ మార్పును పాఠకులు సానుభూతితో చూస్తారని ఆశిస్తాము.

సంపుటి 54 జనవరి '74 సంచిక 1

CP

CHITRA




చితా చింతా ద్వయోర్మధ్యే
చింతా నామ గరీయసీ;
చితా దహతి నిర్జీవం,
చింతా ప్రాణయుతం వపుః. 1

[చితి కన్న చింతే గొప్పది. చితి ప్రాణం లేని శరీరాన్ని దహిస్తుంది; చింత ప్రాణం గల శరీరాన్నే దహిస్తుంది.]

అజగామ యదా లక్ష్మీః
నారికేళఫలాంబువత్.
నిర్జగామ యదా లక్ష్మీః
గజభుక్త కపిత్థవత్. 2

[సంపద వచ్చేటప్పుడు కొబ్బరికాయలోకి నీరు వచ్చినట్టు వస్తుంది; అది పోయేటప్పుడు ఏనుగు తిన్న వెలగకాయ లాగా పోతుంది.]

అసారే ఖలు సంసారే
సారం శ్వశుర మందిరమ్.
హిమాలయే హర శ్శేతే.
హరిః శేతే మహోదధౌ. 3

[నిస్సారమైన సంసారంలో అత్తగారి ఇల్లు సుఖమైనది. (అందుకే) శివుడు (పార్వతి పుట్టిల్లయిన) హిమవత్పర్వతం మీదా, విష్ణువు (లక్ష్మి పుట్టిల్లయిన) సముద్రం మీదా వుంటారు.]



# యక్షపర్వతం

## 20

[సమరబాహు అనుచరులు విసిరిన ఈటె ఒకటి వీరపుర సేనానిని గాయపరిచింది. కొండ ఎక్కి శత్రువులను హతమార్చాలని చూసిన అతడి సైనికులను, ఆటవికులు వదిలిన సింహం, పులులూ హడలకొట్టినై. స్వర్ణాచారి, సమరబాహు అనుచరులతో ఒంటెల మీద పారిపోవాలని చూశాడు. వీరపుర అశ్వికులు వాళ్ళను ఎదిరించారు. తరవాత—]

స్వర్ణాచారి కత్తి దూసి ధైర్యంగా వీరపుర అశ్వికుల మీదికి తన ఒంటెను దూకించటం చూసి, సమరబాహు అనుచరులు ఎక్కడ లేని తెగువతనంతో పోయి శత్రువుల మీద కలియబడ్డారు. అప్పుడు వీరపుర అశ్వికులకూ, సమరబాహు ఉష్ట్రయోధులకూ మధ్య భయంకరమైన పోరాటం సాగింది. ఒంటెల మీదవున్న సమరబాహు అనుచరులు కత్తులతో, ఈటెలతో వీరపురఅశ్వికులను పొడవసాగారు. అశ్వికులు కూడా ధైర్యంగా తమ శత్రువులనూ, వాళ్ళెక్కివున్న ఒంటెలనూ ఈటెలతో కొడుతూ మధ్య మధ్య తమ రాజుకు జయధ్వానాలు పలకసాగారు.

నాలుగైదు నిమిషాలకాలం యీ విధంగా పోరు జరిగే సరికి కొందరు సమరబాహు అనుచరులూ, వీరపుర సైనికులూ గాయపడి తమ తమ వాహనాల మీదినుంచి పట్టు



తప్పి కింద పడిపోయారు. ఒంటెలను ఏనాడూ చూసివుండని వీరపుర సైనికుల గుర్రాలు కొన్ని బెదిరి దూరంగా పరిగెత్త సాగినై. శత్రువులను చుట్టుముట్టి హతం చేయాలని చూసిన వాళ్ళ ప్రయత్నం సాగలేదు. స్వర్ణాచారి, తన అనుచరులను హెచ్చరిస్తూ, చావగా మిగిలిన పదిహేనూ, పదహారు మంది ఉష్ట్రయోధులతో శత్రువుల మధ్యగా దారిచేసుకుని దాపులనున్న అరణ్యంకేసి పారిపోసాగాడు.

ఆ సమయంలో అక్కడికొచ్చిన వీరపుర సేనాని పారిపోతున్న స్వర్ణాచారీ, అతడి అనుచరులకేసి చూసి, "ఇంత కొద్దిమంది శత్రువులు మన చక్రబంధాన్ని ఛేదించుకుని పారిపోగలిగారన్న మాట! ఇంతకన్న అవమానం ఏముంటుంది? ఇంతకూ అశ్వదళ నాయకుడు బతికున్నాడా, చచ్చాడా?" అంటూ కోపంగా అరిచాడు.

స్వర్ణాచారిని చుట్టుముట్టవచ్చిన వీరపుర అశ్వికదళ నాయకుడు సేనాని అరుపు వింటూనే గుర్రంమీద అతడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, సమస్కరించి, "శత్రువుల్ని చాలామందిని చంపాం. కాని, మిగిలినవాళ్ళు అరణ్యంలోకి పారిపోయారు," అన్నాడు.

"ఆ పారిపోవటం నేనూ చూశాను. వాళ్ళను వెంటబడి పట్టుకునే ప్రయత్నం చెయ్యక, నీ విక్కడేంచేస్తున్నావు?" అని అడిగాడు సేనాని కోపంగా.

"అయ్యా, గాయపడిన మనవాళ్ళకు వైద్య సహాయం సంగతి చూసి, ఆ తరవాత మరికొందరు అశ్వికుల సహాయం తీసుకుని అరణ్యంలోకి పోయి శత్రువుల వేట సాగింతాం అనుకున్నాను," అన్నాడు దళనాయకుడు.

"ఈ ఏర్పాట్లన్నీ చేసుకుని, ముహూర్తం కుదిరి నువ్వు వచ్చేవరకూ ఆ ఒంటెల వెధవలు నీ కోసం అరణ్యంలో ఏ చెట్టు నీడనో ఎదురు చూస్తూ కూచుంటారనుకున్నావా? ఆ చొక్కా, పై పంచా కూడా లేని పిలక వెధవ, వీరపుర అశ్వికుల్లో

కొందరిని చంపి క్షేమంగా అరణ్యం చేరా డని తెలిస్తే రాజుగారేమంటారు? నీకూ, నాకూ ఉరి తప్పదు," అన్నాడు సేనాని.

"అయ్యా, ఆ పిలక వెధవ ఒట్టొట్టి పిలక వెధవ కాదు! అతణ్ణి, ఆచార్య మహా మంత్రీ అంటూ అతడి అనుచరులు సంబో ధించటం విన్నాను. అతడు రూపురేఖల్లో, శౌర్యపరాక్రమాల్లో భారతంలోని........"

దళనాయకుడు మాట ముగించకముందే సేనాని గట్టిగా, "ఇక ఆ కవిత్వం చాలు, నోర్మూయ్యి!" అని కోప్పడి, "నువ్వు నలుగు రైదుగురు అశ్వికున్ని వెంటబెట్టుకుని, ఆ గుండు పిలక ఒంటె వెధవా, వాడి తోటి వాళ్ళూ అరణ్యంలో ఎక్కడున్నారో చూసి, వాళ్ళు కనుమరుగు కాకుండా వెన్నంటి వుండు. నేను ముందుగా ఈ కొండకోటను స్వాధీన పరుచుకుని, మన వీరపుర పతా కాన్ని దానిమీద ఎగరవేసి, సైన్యంతో అరణ్యంలోకి వస్తాను," అన్నాడు.

దళనాయకుడు, సేనానికి నమస్కరించి, "చిత్తం!" అని నలుగురు గుర్రపు రౌతుల్ని వెంటబెట్టుకుని, స్వర్ణాచారి అరణ్యంలో ప్రవేశించిన మార్గం వెంట బయలుదేరాడు.

కాని, స్వర్ణాచారి ఆ సరికే అరణ్యంలో చాలాదూరం వెళ్ళిపోయాడు. అతడికే విధంగా అయినా సరే ఖడ్గజీవదత్తులూ, సమరభాహూ ఎక్కడ వున్నదీ తెలును




కోవాలనీ, వాళ్ళకు కొండకోటకు పట్టిన దురవస్థ గురించి చెప్పాలనీ వున్నది. ఎలుగ్గొడ్డు ముఠావాళ్ళు అరణ్యంలో ఏ ప్రాంతాల వుండేదీ అతడికి సూచన ప్రాయంగా తెలుసు. ఆ కారణంవల్ల స్వర్ణా చారి ఆ దిక్కుకేసి బయలుదేరి, కొంత సేపటికి ఒక కొలను ప్రాంతాన్ని చేరాడు.

అందరూ అక్కడ ఒంటెలను దిగి, వాటికి కొలనులో నీళ్ళుపెట్టి, మేయటానికి వదిలారు. స్వర్ణాచారి యిద్దరు అనుచరు లను ఎత్తయిన చెట్టుమీదికి ఎక్కించి, "ఆ వీరపుర కాల్బల సైనికులుగాని, అశ్వ సైనికులుగాని మనను వెతుకుతూ యీ ప్రాంతాలకు వచ్చే ప్రమాదం వున్నది.



కుండా సూటిగా కొలను దగ్గిరకు పరుగెత్తుకుంటూ వస్తున్నారు. వెంటనే చెట్టు మీద కాపలా వున్న వాళ్ళల్లో ఒకడు గబగబా కిందికి దిగి, స్వర్ణాచారి దగ్గిరకు వచ్చి తాను చూసినది చెప్పాడు.

స్వర్ణాచారి తన అనుచరులందర్నీ హెచ్చరించి, వాళ్ళతో కొలను పక్కన వున్న గుబురు పొదల్లోకి పోయి దాక్కొని, "వెతకబోయిన తీగ కాలికి తగలటం అంటే, యిదే! ఈ ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళే మన సమరబాహు రాజును బందీగా పట్టుకుపోయారు," అన్నాడు.

అంతలో ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు కొలనును సమీపించారు. వాళ్ళల్లో ఒకడికి చెట్ల కింద మేస్తున్న ఒంటెలు కనిపించినై. వాడు నిలువెల్లా వణికిపోతూ, "వృకేశ్వరీ మాతా, నువ్వే దిక్కు!" అని కేకపెట్టి, ఒంటెలను తతిమ్మా ఎలుగ్గొడ్డు వాళ్ళకు చూపెట్టాడు.

ఎలుగ్గొడ్డు ముఠా అంతా ఒక క్షణ కాలం స్థాణువుల్లా అయిపోయారు. వాళ్ళలా భయకంపితులైపోయి ఏమి చేయటమా అని ఆలోచించే సమయంలో స్వర్ణాచారి హఠాత్తుగా సమరబాహు అనుచరులతో వచ్చి వాళ్ళ మీద పడి, ఇద్దర్ని ఈటెలతో గట్టిగా పొడిచాడు. వాళ్ళు, "చస్తిమి, వృకేశ్వరీ మాతా!" అంటూ కిందపడే లోపలే అయి

వాళ్ళ రాక ముందుగా మనకు తెలియటం మంచిది. కొద్ది మంది శత్రువులనయితే యిక్కడే నరికి పోగులు పెడదాం. మరీ అధిక సంఖ్యలో వుంటే యీ ప్రాంతం వదిలి మరొక చోటుకు తరిలిపోదాం. కనక మీరు అప్రమత్తులుగా వుండి, చుట్టుపక్కల ప్రదేశాలను పరీక్షగా చూస్తూండండి," అని ఆజ్ఞాపించాడు.

ఒక అరగంట కాలం గడిచింది. చెట్టు మీద వున్న సమరబాహు అనుచరుల్లో ముందుగా ఒకడికి, తామున్న చోటు కేసి పరిగెత్తుకుంటూ వస్తున్న పదీ పన్నెండు మంది ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళు కనిపించారు. వాళ్ళు వెనకా ముందులు చూసుకో

దారుగురు ఎలుగ్గొడ్డు మనుషులు ఆయుధాలు కింద పడేసి లొంగిపోయారు. మిగిలిన వాళ్ళు పులిని చూసిన లేళ్ళలా ఎగిరి గంతేసి, వచ్చిన దారినే తిరిగి పరిగెత్తారు.

అలా పారిపోయిన ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళే కొలను కేసి వస్తున్న ఖడ్గ జీవదత్తులకూ, సమరబాహుకూ, గురుభల్లూకుడికీ ఎదురుపడి స్వర్ణాచారిని గురించి చెప్పారు.

"ఎక్కడో కోట కట్టే ప్రయత్నాల్లో కొండ మీద వుండవలసిన స్వర్ణాచారి, యీ అరణ్యంలోని కొలను ప్రాంతం చేరాడంటే చాలా ఆశ్చర్యంగా వుంది. కొండ మీద ఏవో చిక్కుల్లో పడి యిక్కడికి పారిపోయి రాలేదు గదా?" అన్నాడు జీవదత్తుడు.

"స్వర్ణాచారి గొప్ప ప్రభు భక్తి పరాయణుడు. బహుశా, నన్ను ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళ నుంచి కాపాడాలన్న ప్రయత్నంలో యిక్కడికి వచ్చి వుంటాడు!" అన్నాడు సమరబాహు తృప్తిగా.

ఈ సంభాషణేమీ అర్థం కాక గురుభల్లూకుడు తనకు మరెవరో కొత్త వాళ్ళ నుంచి ప్రమాదం రాబోతున్నదని భయపడి, ఖడ్గ జీవదత్తులకు నమస్కరించి, "మీరు నాకు ప్రాణదానం చేస్తామని అభయం యిచ్చారు, మరవకండి!" అన్నాడు.

ఆ మాటలకు జీవదత్తుడు నవ్వి, "గురుభల్లూకా, మా నుంచిగాని, కొలను దగ్గిర




వున్న యీ సమరబాహు అనుచరుల నుంచిగాని నీకు ఎలాంటి ప్రమాదం రాదు, భయపడకు!" అన్నాడు.

"సాక్షాత్తూ వృకేశ్వరీదేవే నీకు అండగా వుండగా భయమెందుకు?" అన్నాడు ఖడ్గవర్మ నవ్వుతూ.

వాళ్ళిలా మాట్లాడుకుంటూ కొలను దగ్గిరకు వచ్చేసరికి, స్వర్ణాచారి తనకు దొరికిన ఎలుగ్గొడ్డు ముఠా వాళ్ళను సమరబాహు ఎక్కడ వున్నదీ తెలుసుకునేందుకు ప్రశ్నిస్తున్నాడు. అతడు ఖడ్గ జీవదత్తుల్నీ, సమరబాహునూ అల్లంత దూరంలో చూస్తూనే బ్రహ్మానందం చెంది వాళ్ళ దగ్గిరకు పరుగు పరుగున వచ్చి, "సమరబాహు మహారాజా,




క్షత్రియ యోధుల్లారా, యివే నా నమస్కారాలు!" అన్నాడు వంగి నమస్కరిస్తూ.

"స్వర్ణాచారీ, నువ్వేదో మీ మహారాజుగారి కోటను గాలికి వదిలి, అరణ్య విహారానికి బయలుదేరి వచ్చినట్టు కనబడుతున్నదే!" అన్నాడు జీవదత్తుడు.

"క్షత్రియ వీరయోధుల్లారా, ఆ కోట శత్రువుల వశమైపోయింది. దాన్ని రక్షించేందుకు నేనూ, సమరబాహు అనుచరులూ గట్టి ప్రయత్నమే చేశాం. ఆ ప్రయత్నంలో కొందరు వీర స్వర్గం అలంకరించారు కూడా." అన్నాడు స్వర్ణాచారి విచారంగా.

"అందరూ వీరస్వర్గం అలంకరించకుండా కొందరైనా యీ భూమి మీద ప్రాణాలతో వుంటే, ముందు ముందు మీ కాబోయే రాజుకు సాయపడే అవకాశం వుండేది. వీరస్వర్గానికి పోకుండా యిక్కడే వుండిపోయిన వాళ్ళెంతమంది?" అని అడిగాడు ఖడ్గవర్మ.

స్వర్ణాచారి తనతో కొలను దగ్గరకు వచ్చిన సమరబాహు అనుచరుల కేసి ఒకసారి తల తిప్పి చూసి, "నాతో కలిపి పదహారు మందిమి. మా వాహనాలు పదహారు ఉష్ట్రాలు కూడా యిక్కడే వున్నవి," అన్నాడు.

"కొండకోటను శత్రువులు ఆక్రమించారా! ఎలా ఆక్రమించగలిగారు? ఎవరా శత్రువులు?" అన్నాడు సమరబాహు కోపంతో పళ్ళు కొరికి, మీసం మెలివేస్తూ.

స్వర్ణాచారి, అరణ్యంలోకి వచ్చిన వీరపుర జంతు ప్రదర్శనశాలాధికారితో ప్రారంభించి, ఆ తరవాత వీరపుర సైనికులు కొండ మీది కోటను పట్టుకోవటానికి చేసిన ప్రయత్నం, అప్పుడు జరిగిన యుద్ధంలో తాను పొందిన ఓటమీ, చావగా మిగిలిన అనుచరులతో అరణ్యంలోకి పారిపోయి రావటం—అంతా టూకీగా చెప్పాడు.

అంతా శ్రద్ధగా విన్న సమరబాహు పెద్దగా నిట్టూర్పుతూ, "అంటే, కోటతో పాటు మనం ఎంతో కాలంగా కూడబెట్టిన ధన ధాన్య సంపద యావత్తూ శత్రువశమైందన్న మాట! ఆ వీరపుర రాజును క్షమించరాదు.

అతడి అంతం చూడాలి. ఖడ్గ జీవదత్త యోధుల్లారా, ఇందుకు మీరు నాకు సాయ పడాలి," అన్నాడు.

జీవదత్తుడు, సమరబాహు కేసి జాలిగా చూస్తూ ఏదో అనబోయేంతలో ఖడ్గవర్మ కోపంగా, "సమరబాహూ, ఇప్పుడు నీకే ఆపదవచ్చిందని మా సాయం కోరుతున్నావ్? నిన్ను ఎలుగ్గొడ్డు మృతా వాళ్ళ నుంచి రక్షిస్తామని మాట యిచ్చి నెరవేర్చుకున్నాం. ఇక మా దారిన మేం వింధ్యపర్వతాలకు పోదలిచాం. అక్కడ మేమొక రాతిరథాన్ని కదిలించవలసి వున్నది. కాని, దారి పొడు గునా మేము యితరుల్ని చిక్కుల్లో నుంచి కాపాడాలన్న ధర్మబుద్ధి కొద్దీ కాలయాపన చేస్తున్నాం. ఇక ఆ ధోరణికి స్వస్తి చెప్పాలి," అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ వీపు తట్టి తొందర పడవద్దన్న సూచనగా తలాడించి హెచ్చ రిక చేసి, "సమరబాహూ, నువ్వు రాజ్యం సంపాయించి పోగొట్టుకున్న వాడివి కాదు గదా, వీరపుర రాజు మీద పగ సాధించ టానికి? ఈ మహారణ్యంలో ఏ ప్రాంతాన అయినా నీ అనుచరులతో సుఖంగా పంటలు పడించుకుంటూ హాయిగా బతకవచ్చునే," అన్నాడు.

సమరబాహు జవాబివ్వకుండా తలవంచు కున్నాడు.



అప్పుడు స్వర్ణాచారి కలగజేసుకుని, "క్షత్రియ యోధుల్లారా, నా దొక మనవి, చిత్తగించాలి! పేరును బట్టి యీ సమర బాహు ఏ చంద్రవంశజుడో అయి వుంటాడని నాకు నమ్మకం కలుగుతున్నది. అలాంటి వాడు యిక్కడెక్కడైనా చిన్న రాజ్యం స్థాపించగా చూసి, అతడి దగ్గిర మంత్రిత్వం నెరపాలన్న కోరిక నాక్కలుగుతున్నది. మీరు దయ తలచి సాయపడితే కనీసం, ఆ వీరపురరాజును కొండకోట ప్రాంతాల నుంచయినా తిరోగమించేలా చేయగలం. అప్పుడు కొండకోట, ఆ చుట్టుపక్కల వున్న ఆటవిక గూడేలతో కలిసి ఒక రాజ్య మవుతుంది," అన్నాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మ కేసి చూసి, "ఖడ్గా, ఈ పాటి సాయం మనం చేయటం బావుంటుందనుకుంటాను," అని సమర బాహు, స్వర్ణాచార్లతో, "మనం ముందుగా యిక్కడికొచ్చిన వీరపుర సైనికుల్ని దెబ్బ తీయాలి. అల్ప సంఖ్యలో వున్న మనం వాళ్ళతో ముఖా ముఖి యుద్ధం చేయలేం గనక ఉపాయంతో వాళ్ళను ఓడించాలి. అందుకొకే ఒక మార్గం వున్నది. ఆ సైనికులందర్నీ గురుభల్లూకుడి బిలదుర్గంలో ప్రవేశించేలా చేయాలి," అన్నాడు.

"అదెలా సాధ్యం, జీవదత్త ప్రభూ? వాళ్ళు ఆ బిలంలోకి ప్రవేశించేలా చేయటం ఎలా?" అన్నాడు స్వర్ణాచారి ఉత్సాహం పట్టలేక.

"అందుకు గురుభల్లూకుడి శిష్యుల్లో ఒకళ్ళిద్దరు వీరపుర సైనికుల దగ్గరకు పోయి, వాళ్ళ నాయకుడితో మనమంతా ఆ బిలంలో దాక్కుని వున్నామని చెప్పాలి. వాళ్ళు మనను వధించేందుకు బిలంలో ప్రవేశిస్తారు. అప్పుడు...." అంటూ ఆగి జీవదత్తుడు, గురుభల్లూకుడితో, "భల్లూకా! నీ శిష్యులు నీ మాటకు జవదాటని తత్వం గలవాళ్ళా లేక గురువుకే ద్రోహం చేసే రకమా?" అని అడిగాడు.

ఆ ప్రశ్న వింటూనే గురుభల్లూకుడు ఉద్రేకపడిపోతూ, "అయ్యా, నా శిష్యుల గురు భక్తి యిప్పుడే రుజువు చేస్తాను. నేను ఆజ్ఞాపిస్తే వాళ్ళు కొండ శిఖరం మీద నుంచి అయినా కిందికి దూకుతారు. ఇక్కడ కొండ లేదు గనక, ఆ కనబడే చెట్టు చిటారు కొమ్మ మీది నుంచి కిందికి దూకమని ఆజ్ఞాపిస్తాను," అని ఒక ఎలుగ్గొడ్డు వాడితో, "ఒరే, శిష్యా! నువ్వు ఆ చెట్టు చిటారు కొమ్మకు పోయి, అక్కణ్ణించి భూమి మీద పడు!" అన్నాడు.

జీవదత్తుడు వారించే లోపలే ఎలుగ్గొడ్డు వాడు పరుగెత్తుకుంటూ పోయి, నూరేడు గుల ఎత్తున్న ఒక చెట్టు పైకి పాకి, అక్కణ్ణించి, "గురుభల్లూకా!" అంటూ అరిచి, చేతిపట్టు వదిలి, తలకిందులుగా నేల మీదికి పడసాగాడు. —(ఇంకావుంది)





# దైవోపహతుడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాలుడు, "రాజా, దైవనింద అనేక అపదలకు దారి తీస్తుంది. నీకు ఇలా శ్రమ కలగ టానికి కారణం దైవదూషణ కాదుగద? దేవతలను నిందించి పడరాని కష్టాలు పడిన యౌధేయశృంగుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

అదికాలంలో సింధు ప్రాంతంలోని అరణ్యాలలో అనేక ఆటవిక తెగలవాళ్ళు ఉండేవారు. వారిలో యౌధేయులనే వాళ్లు ఒక తెగ. వాళ్ళు అరణ్యాలలో తిరుగుతూ, మృగాలను వేటాడుతూ పశుప్రాయులుగా జీవించేవారు. ఆ తెగలో

## బేతాళ కథలు



శృంగుడు అనేవాడు ఒకడు పుట్టు కొచ్చాడు. వాడి శక్తులూ, సాహసమూ, బుద్ధిబలమూ అసాధారణమైనవి. కుర్ర వాడుగా ఉండగానే యౌధేయులు వాడి మాటలు విని, వాడు చెప్పినట్టు నడుచు కుంటూ చాలా మేలుపొంది, వాణ్ణి తమ నాయకుడుగా చేసుకున్నారు.

శృంగుడు తన సమస్త శక్తులనూ ధారపోసి, తన జాతిని ఉద్ధరించటానికి కంకణం కట్టుకున్నాడు. యౌధేయు లుండే ప్రాంతానికి చేరువలో మాయావు లనే జాతి వాళ్ళుండే వారు. వాళ్ళు అద్భుతమైన మాయలు తెలిసిన వాళ్ళు. వారి వద్ద అంతులేని ధనరాసు లుండేవి. మేడలూ, మిద్దెలూ కట్టటం వారికి తెలు సును. కాని మాయావులు బలమైన జాతికాదు. వాళ్ళు కోటలు నిర్మించుకుని వాటి మధ్య నిర్భయంగానూ, నిశ్చింత గానూ జీవిస్తూ, ఇతరుల సంగతి పట్టించు కునే వారు కారు.

శృంగుడు తన జాతివాళ్ళను మంచి యోధులుగా తయారు చేసి మాయావుల కోటల మీదికి దాడులు జరిపాడు. మాయావులు మొదట్లో తమ మాయలతో ఆటవికులకు దిగ్భ్రమ కలిగించినా, శృంగుడి శక్తి యుక్తుల ముందు వారి మాయలు ఫలించక, చివరకు పూర్తిగా ఓడిపోయారు. వారి కోటలు శృంగుడి వశ మయాయి. వివిధ శిల్పులను బానిసలుగా పట్టుకుని శృంగుడు వారిచేత ఒక మహా నగరం నిర్మింపజేసి, వారి నుంచి కొల్ల గొట్టిన సంపదలతో ఒక రాజ్యం ఏర్పాటు చేసుకున్నాడు.

నిన్నటి దాకా ఆటవిక జీవితం గడిపిన యౌధేయులకు శృంగుడి ధర్మాన నాగ రిక వృత్తులూ, కళలూ లభించాయి. వాళ్ళు వ్యవసాయమూ, పశువుల పెంపకమూ నేర్చుకుని, ఎన్నడూ ఎరగ నంత సుఖంగా జీవించటం ఆరంభిం చారు. వారికి ఇప్పుడు శృంగుడు ఎంతో ప్రియమైన రాజు.

అయితే శృంగుడు తన ప్రజలలో ఒక్క లోపం గమనించాడు. ప్రజలు ఇప్పుడు నాగరిక జీవనం నేర్చు కున్నప్పటికీ వారి ఆలోచనలూ, నమ్మకాలూ ఇంకా వెనకటిలాగే అనాగరికంగా ఉన్నాయి. వారికి మూఢ విశ్వాసాల వల్ల నష్టం కలుగుతుందని చెప్పటానికి శృంగుడు తన జాతి వారినందరినీ రాజభవనం ముందున్న విశాలమైన మైదానం మీద సమావేశం కమ్మని కబురు చేశాడు. శృంగుణ్ణి దేవుడి అవతారంగా భావిస్తున్న యౌధేయులు రాజభవనం ముందు హాజరయారు. వారి వెనక ఒక కొండ ఉన్నది. ముందు రాజభవనం ఉన్నది.

శృంగుడు రాజభవనం మిద్దె మీదికి వచ్చి తన ప్రజలను చూశాడు. అతన్ని చూడగానే ప్రజలు జయధ్వానాలు చేశారు. అతను వారిని సంబోధిస్తూ, "నేను మిమ్మల్ని ముందు ఒక్క విషయం అడగాలి. మీ రిప్పుడు వెనకటి కన్న సుఖంగానూ, ఆరోగ్యంగానూ, ఉన్నతంగానూ జీవిస్తున్నారు. దీనికి కారణం ఏమిటో ఆలోచించారా?" అని అడిగాడు.

"అంతా ఆ దేవతల అనుగ్రహం!" అన్నారు ప్రజలు.

శృంగుడు ముఖం చిట్లించి, "ఇందులో దేవతల ప్రమేయం ఏ మున్నది?"



అన్నాడు. ఆ తరవాత అతను ఏమన్నాడో ఎవరికీ వినిపించలేదు. భయంకరమైన ఉరుముల లాటి ధ్వనులు భూమ్యాకాశాలు నిండాయి. నేల కంపించి నెర్రెలు విచ్చింది. ఆ నెర్రెలలో నుంచి పాములూ, మండ్రగబ్బలూ, పెద్ద పెద్ద కాళ్ళ జెర్రులూ బయటికి వచ్చాయి. రాజభవనానికి ఎదురుగా ఉన్న కొండ గర్జించింది. దాని శిఖరం వెనక నుంచి ఎర్రని మంటలూ, భయంకరమైన నల్లని పొగా ఆకాశం ఎత్తులేచాయి. ప్రజల మీద భస్మం రాలసాగింది. శృంగుడు ధరించిన అందమైన బట్టలు క్షణంలో మసిగుడ్డల్లాగా అయిపోయాయి.



జనం పారిపోయారు. ఆ ఉపద్రవంతో చాలా బీభత్సం జరిగింది. భూకంపాలకు నగరంలోని ఇళ్ళన్నీ చాలాభాగం కూలి పోయాయి; కొన్ని దెబ్బతిన్నాయి. జనం చాలామంది చచ్చారు.

అగ్నిపర్వతం శాంతించిన అనంతరం ఎక్కడ చూసినా బూడిద కుప్పలే మిగిలాయి.

యౌధేయులకు శృంగుడిలో విశ్వాసం పోయింది. అతను దైవదూషణ చేసి, దేవతలకు ఆగ్రహం తెప్పించి, సర్వ నాశనం చేశాడు. వాళ్ళకు అతని పట్ల ఉండే విశ్వాసం ఒక్క దెబ్బతో తుడిచి పెట్టుకు పోయింది.

ఈ వార్త ఉత్తర ప్రాంతాన ఉండే యవనరాజు రావలుడికి తెలిసింది. అతను తన సైన్యాన్ని వెంట బెట్టుకుని శృంగుడి పైకి యుద్ధానికి వచ్చాడు.

శృంగుడు తన ప్రజలను యుద్ధానికి పురికొల్పాడు. కాని వాళ్ళు తమ రాజును దైవోపహతుడుగా భావించి, యుద్ధం చేయ నిరాకరించారు. శృంగుడు శత్రువుకు చిక్కకుండా తన సైంధవాశ్వం మీద పారిపోయి, కొద్దిలో చావు తప్పించుకున్నాడు. అతనికి ఇప్పుడు తన వారితో సహా అంతా శత్రువులే. మాయావులకూ, యవనులకూ, ఇతర ఆటవిక జాతులకూ దొరకకుండా పారిపోవాలంటే అతను తూర్పుగానే వెళ్ళాలి. అతను అతి ప్రయాస మీద ఎడారిదాటి, ఇరవైరోజుల అనంతరం ఇంద్రప్రస్థం అనే రాజ్యాన్ని చేరుకున్నాడు.

అతనికి ఆ నగరంలో ఒక ఉద్యానం కనబడింది. కాని ఆ సమయంలో అందులో రాజకుమార్తె కేశిని విహరిస్తూ ఉండటం చేత అతన్ని భటులు లోపలికి పోనివ్వ లేదు. అందుచేత అతను ఉద్యానం వెలపల ఒక చెట్టు నీడన పడుకుని నిద్ర పోయాడు.

కొంత సేపటికి రాజకుమార్తె పరిచారిక ఒకతె బయటికి వచ్చి, అతన్ని చూసి,

అతని అందానికి ఆశ్చర్యపోయి, తిరిగి వెళ్ళి రాజకుమార్తెతో చెప్పింది. రాజకుమార్తె కేశిని అతన్ని తన దగ్గిరికి పిలిపించుకుని, అతని పరిస్థితి గ్రహించి పళ్ళూ, పానీయాలూ ఇప్పించింది.

కొంచెం ఆహారం లోపల పడగానే శృంగుడికి ప్రాణం లేచి వచ్చింది.

అతను మామూలు బాటసారి కాదని రూఢి చేసుకుని, కేశిని, "మీ రెవరు? మీది ఏ దేశం? ఇక్కడికి ఏం పనిమీద వచ్చారు?" అని అడిగింది.

కేశిని గొప్ప సౌందర్యవతి. ఆమెను చూడగానే శృంగుడికి ప్రేమ కలిగింది. కాని ఆమె చూపే ఆదరం అతన్ని బాధించింది. అతను నిస్పృహతో, "నేను ఇప్పుడు ఎవరినీ కాను. కాని ఒకప్పుడు శక్తిమంతుణ్ణి, సమర్థత చూపినవాణ్ణి," అన్నాడు.

కేశిని అతన్ని తన వెంట రాజభవనానికి తీసుకుపోయి, తన తండ్రితో, తనకు అతన్ని పెళ్ళాడాలని కోరిక ఉన్నట్టు చెప్పింది.

"ఊరూ పేరూ తెలియని వాణ్ణి ఎలా పెళ్ళాడతావు? నువు సరేనంటే ఎంత లేసి రాజకుమారులూ నిన్ను పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నారు," అన్నాడు కేశిని తండ్రి.



కేశిని శృంగుణ్ణి మరొకసారి అతని సంగతి అడిగి, "మీరు కూడా ఒక రాజకుమారుడేనని నేను నమ్ముతున్నాను. మీరు మీ విషయం చెప్పినట్టయితే మనకు మా తండ్రి పెళ్ళి చెయ్యవచ్చు," అన్నది.

శృంగుడు కంగారుపడి, "అంత అదృష్టానికి నేను నోచుకోలేదు. నా దశ బాగాలేదు," అంటూ తన కథ అంతా కేశినికి చెప్పాడు.

అతను యౌధేయశృంగుడని తెలియగానే కేశిని ఎంతో సంతోషించింది. కొద్ది కాలం కిందట అతన్ని గురించి గొప్ప గొప్ప వార్తలు ఆమె విని ఉన్నది. ఆమె అతనితో, "మీరేమీ విచారించకండి.



మనకు పెళ్ళి అయితే ఇంద్రప్రస్థ రాజ్యం మీదే అవుతుంది, మీరు తిరిగి రాజు కావచ్చు. మీ చెడ్డ రోజులు అయిపోయా యనుకోండి." అన్నది.

ఆమె వెళ్ళి తన తండ్రికి శృంగుడి వృత్తాంతం చెప్పింది. కాని ఆయన సంతోషించి వివాహానికి ఒప్పుకోవటానికి మారుగా, వెలవెలపోయి, ఒక్క క్షణం ఆలోచించి, వెంటనే తన రహస్య మంది రానికి రమ్మని మంత్రులకు కబురు పంపాడు.

కేశిని ముందే రహస్య మందిరానికి వెళ్ళి ఒక తెరచాటున దాగి, రాజూ, మంత్రులూ జరిపిన చర్చ అంతా విన్నది.

మొదట రాజు తన మంత్రులకు శృంగుడి వృత్తాంతం అంతా చెప్పి, "అతను ఇప్పుడు మన అతిథిగా ఉన్నాడు," అన్నాడు.

వెంటనే ఒక మంత్రి, "మహారాజా, రావలుడు బలవంతుడు. మనం ఈ శృంగుణ్ణి బంధించి అతనికి అప్ప జెప్పితే మనం రావలుడితో శాశ్వతమైత్రి సాధించవచ్చు," అన్నాడు.

"అతిథిని శత్రువుకు పట్టి ఇవ్వటం ధర్మం కాదు. అతన్ని వెంటనే సాగ నంపటం మంచిది. లేకపోతే, అతను ఇక్కడ ఉన్నట్టు తెలిసి రావలుడు మన పైకి యుద్ధానికి రావచ్చు," అన్నాడు మరొక మంత్రి.

మంత్రులందరూ ఇదే విధంగా మాట్లాడిన మీదట రాజు, "అమ్మాయి అతన్ని పెళ్ళాడ గోరుతున్నది. లేకపోతే మనకు సమస్యే లేదు," అని అసలు సంగతి బయటపెట్టాడు.

ఈ మాట వింటూనే ఒక మంత్రి, "మహారాజా, అమ్మాయిగారి కోరిక తీర టానికి ఒకటే మార్గం. మనమే పరిసర రాజులను చేర్చుకుని ఈ రావలుడి మీద యుద్ధం చేద్దాం. అతని మూలంగా అనేక దేశాలకు శాంతి లేకుండా ఉన్నది. అతన్ని ఓడించిన కీర్తి మన దేశానికి

దక్కేటట్టు చేద్దాం. అందువల్ల శృంగుడి సమస్యా తీరుతుంది, అమ్మాయి గారి కోరికా తీరుతుంది,'' అన్నాడు.

ఈ ఆలోచన అందరికీ నచ్చింది.

రావలుణ్ణి హతమార్చటానికి అనేక చిల్లర దేశాల వాళ్ళు కలిసి వచ్చారు. పెద్ద సేన తయారయింది. అందులో శృంగుడు ఒక సామాన్య యోధుడుగా చేరాడు. యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో యవన రావలుణ్ణి శృంగుడు స్వయంగా ఎదిరించి, తాను తీవ్రంగా గాయపడి నప్పటికీ అతన్ని చంపాడు.

తరవాత శృంగుడు తన జాతివారంతా ఏమయారని విచారిస్తే, చాలా మంది తిరిగి ఆటవిక జీవితం జీవిస్తున్నట్టూ, కొంత మంది యవనుల దగ్గిరా, మాయావుల దగ్గిరా బానిసలుగా ఉంటున్నట్టూ తెలిసింది. అతను ఆటవికుల నందరినీ మళ్ళీ చేరదీసి తిరిగి పట్టణం నిర్మించి, రాజ్యం స్థాపించి, ఆ తరవాత కేశినిని పెళ్ళాడాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, దైవోపహతుడైన యౌధేయ శృంగుడి పై దేవతలు తిరిగి ఎందుకు కరుణించారు? అతని జాతివాళ్ళు తిరిగి అతని అండన ఎందుకు చేరారు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''శృంగుడు దైవోపహతుడన్న మూఢ విశ్వాసం అతని జాతి వాళ్ళది. అలాటి మూఢ విశ్వాసాలను వదిలించటానికి అతను వారిని సమావేశపరిచిన సమయంలో యాదృచ్ఛికంగా అగ్నిపర్వతం పేలింది. మూఢులైన యౌధేయులు దాన్ని దైవనిర్ణయంగా భావించారు. కాని ఆ శృంగుడే తిరిగి విజయం సాధించేసరికి అతనికి దైవానుగ్రహం మళ్ళీ కలిగిందనుకుని అతని అండ చేరారు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# భార్య సలహా

కోటిపల్లి అగ్రహారంలో ఒకే పురోహితుడు ఉండే వాడు. పౌరోహిత్యంలో గట్టివాడే గాని, అతనికి వల్లమాలిన ఆశ. చుట్టుపట్ల అందరూ అవసరం పడినప్పుడల్లా అతన్నే పిలిచే వారు. అవతలి వాళ్ళు ఉన్న వారైనా, లేనివారైనా, ఈ పురోహితుడు అందరివద్దా ఒకే విధంగా డబ్బు పుచ్చు కునే వాడు; అందరినీ పీడించి గోదానాలు పట్టేవాడు.

ఒకసారి ఆ ప్రాంతాల చాలా గ్రామా లలో అంటువ్యాధులు వచ్చి ఎంతో జన నష్టం జరిగింది. దానితో పురోహితుడి పంట పండింది. కర్మకాండ చేయించ టానికి మరొక పురోహితుడు లేక పోవ టంతో అందరూ అతన్నే పిలిచారు.

కర్మ చేయించి నందుకు గోదానం ఇయ్యాలని పురోహితుడు అందరి దగ్గిరా పటుపట్టాడు. గోదానం ఇయ్యకపోతే కర్మ నిలిచి పోతుందని భయపడి, ప్రతి ఒకరూ ఏ గొడ్డుబోతు ఆవునో, ఎండి పోయిన ఆవునో ఆయనకు దానం ఇచ్చారు. అలా వచ్చిన పనికిమాలిన ఆవుల నన్నిటినీ, ఆయన శ్రమపడి ఇంటికి తోలుకు వచ్చేవాడు.

కొద్ది రోజులలో పురోహితుడి దొడ్డి అంతా ఆవులతో నిండిపోయింది. కాని పురోహితుడికి పెద్ద సమస్య ఏర్పడింది. అన్ని ఆవులను ఎలా మేపటం? వాటికి మేత ఎక్కడి నుంచి తేవటం? ముందు ఆ ఆవులు వర్షానికి తడవకుండా పెద్ద పాక ఒకటి వెయ్యవలిసి వచ్చింది. ఆ పాక వెయ్యటానికి పురోహితుడు కూడబెట్టిన డబ్బులో బోలెడంత ఖర్చు అయింది.

ఆవులకు మేత కొని వెయ్యాలంటే చాలా ఖర్చు అవుతుంది. మేత సరిగా

పి. వి. సావిత్రి

లేకపోతే అవి చస్తాయి ; తనకు గోహత్యా పాతకం చుట్టుకుంటుంది. అందుచేత పురోహితుడు తానే వాటి నన్నిటినీ మేతకు తోలుకు పోసాగాడు. ఈ పని మీద వేసుకున్న తరవాత పౌరోహిత్యం సాగలేదు.

కాలక్రమాన అతనికి తాను ఉభయ భ్రష్టుడయినట్టు స్పష్టమయింది. ఎంత కాలం మేపినా ఒక్క ఆవు కూడా పాలియ్యదు. అన్నీ ఎండిపోయినవీ, వట్టిపోయినవీనూ. ఈ దిక్కుమాలిన ఆవుల కోసం తాను బంగారం లాటి పౌరోహిత్యాన్ని కూడా పోగొట్టుకున్నాడు. పౌరోహిత్యం మానే సరికి ఇంట్లో జరుగుబాటు కాకుండా పోయింది. తాను పౌరోహిత్యం మాని పశువులకాపరి అయాడే గాని అందువల్ల అన్ని విధాలా నష్టమే వచ్చింది.

పోనీ ఎవరన్నా కుర్రవాణ్ణి ఆవులను కాయటానికి పెట్టు కుందామంటే, వాడికి కనీసం మూడు పూటలా తిండి అయినా పెట్టాలి. పురోహితుడి భార్య రోగిష్టిది. వాడికి వండి పెట్టటం తన వల్ల కాదని ఆమె చెప్పేసింది. గత్యంతరం లేక పురోహితుడు తాను పెట్టుకున్న కుర్రవాడికి తానే వండిపెట్టుతూ కొంత కాలం గడిపాడు.

ఆవులు పాలిచ్చేవి కాకపోవటంతో ఆయన ఎంత శ్రమపడినా, అంతా బూడిదలో పోసిన పన్నీరు అయింది. " భగ



వంతుడా, నిక్షేపంగా పౌరోహిత్యం చేసుకుని బతుకుతున్న వాడికి ఎన్ని కష్టాలు తెచ్చి పెట్టావురా!'' అని అయన దేవుణ్ణి తిట్టిపోసేవాడు. తన దురాశే తన కష్టాలన్నిటికీ మూలమని ఆ మానవుడు గ్రహించలేదు.

అయితే అతన్ని ఈ కష్టాల నుంచి బయట పడేసినది అయన భార్యే. ఆమె చాలా తెలివి గలది. కొన్నాళ్ళుగా ఆమె భర్త పడుతున్న పాట్లు గమనిస్తూనే వున్నది.

''మీరు ఇలా దిగులు పడితే ఏమీ ప్రయోజనం ఉండదు. నేనొక ఉపాయం చెబుతాను, అలా చెయ్యండి. మీ కష్టాలు గట్టెక్కుతాయి,'' అన్నదామె పురోహితుడితో.

''చెప్పు, అలాగే చేద్దాం,'' అన్నాడు పురోహితుడు.

''చూడండి, ఈ పనికిమాలిన ఆవులన్నిటినీ వచ్చినంత ధరకు అమ్మెయ్యండి. ఆ డబ్బుతో రెండు శేర్లు పాలిచ్చే మంచి ఆవులను రెంటిని కొనండి. ఎవరన్నా గోదానం చెయ్యదలిచినప్పుడు, వాళ్ళు గోవును కొనటానికి ఖర్చుపెట్టే మొత్తాన్ని మీరే తీసుకుని, గోవును కొనితెస్తానని చెప్పి, మన ఆవును ఒక దాన్ని తీసుకుపోయి, మూడు రోజులు ముందుగా వాళ్ళ ఇంట కట్టేసి, దాన్నే దానం పుచ్చుకుని చక్కగా ఇంటికి తీసుకురండి. ఆవులతో మనకు చక్కగా బోలెడంత డబ్బు వస్తుంది, ఇంట్లో పాడీ ఉంటుంది. వాటి మేతా, పోషణా ఒక సమస్య కాదు,'' అన్నది పురోహితుడి భార్య.

ఈ మాట వినగానే పురోహితుడికి ప్రాణం లేచి వచ్చింది. అయన పనికిమాలిన ఆవులను ఏ కసాయి వాళ్ళకో అమ్మేశాడు. తరవాత భార్య చెప్పినట్టు రెండు మంచి పాడి ఆవులను కొని, వాటి మీద బోలెడంత డబ్బు సంపాదిస్తూ, నిర్విఘ్నంగా పౌరోహిత్యం చేసుకుంటూ హాయిగా బతికాడు.





# దేవుడికంటె గొప్పవాడు

మన దేశంలో అరణ్య ప్రాంతాలలో కర్షక గ్రామాలు విస్తరించే కాలంలో రత్నాకరదేశాన్ని మణికంతు డనే రాజు సమర్థతతో పరిపాలించాడు. ఆయన పరిపాలనా దక్షత ఫలితంగా ఆ రాజ్యం నాలుగు దిక్కులా బాగా విస్తరించింది. మారుమూలల నివసించే ప్రజల కష్ట సుఖాలను కేంద్రంలో ఉన్న రాజు విచారించటం కష్టసాధ్యమయింది. ఈ సమస్యను గురించి మణికంతుడు మంత్రులతో విచారించగా, దేశాన్ని నాలుగు ప్రాంతాలుగా విభజించి, నాలుగు ప్రాంతాలనూ పాలించటానికి దక్షత గల రాజ ప్రతినిధులను నియమించమన్నారు.

వెంటనే రాజు తన రాజ్యాన్ని విభజించి, నాలుగు భాగాలకూ నలుగురు విశ్వాసపాత్రులైన రాజ ప్రతినిధులను నియమించాడు.

ఇందువల్ల చాలా మేలు కలిగినట్టు కనిపించింది. నలుగురు రాజ ప్రతినిధులూ నెల నెలా రాజుకు తమ ప్రాంతంలో ఉండే ప్రజలకు గల అసౌకర్యాలను గురించీ, వాటిని తొలగించటానికి తీసుకుంటున్న చర్యలను గురించీ నివేదికలు పంపుతూ వచ్చారు.

రాజ ప్రతినిధులు రాజుపట్ల భక్తి విశ్వాసాలు కల వారనటానికి సందేహం లేదు. కాని అందువల్లనే కొన్ని చిక్కులు బయలుదేరాయి. వారిలో ప్రతి ఒకడూ తన రాజ్యభాగం మిగిలిన మూడింటి కన్నా ఉన్నతంగా తయారు కావాలని తమలో తాము పోటీ పడ్డారు. ప్రజలను ఉత్సాహపరచటానికి వారు ప్రాంతీయాభిమానాలను రెచ్చగొట్టారు. రాజ్యం అంతటా ఉన్న వాళ్ళంతా ఒకే జాతి వాళ్ళుకారు. గణ పరిపాలన



ఉన్నప్పుడు ఒక జాతి వాళ్ళు మరొక జాతితో చీటికీ మాటికీ తగూ లాడుకునే వారు. కాని ఒక పరిపాలన కిందికి వచ్చే సరికి జాతివైరాలు వెనక పడిపోయాయి. కొత్త రాజ ప్రతినిధులు తమలో తాము పోటీలు పడి ఈ జాతి వైరాలు తిరిగి తల ఎత్తటానికి అవకాశం కలిగించారు.

ఇంతేగాక, ఏ ప్రాంతంలో అభివృద్ధి అయే సంపద ఆ ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి పోకుండా రాజ ప్రతినిధులు కట్టుదిట్టాలు చేశారు. ఉత్తర భాగంలో పత్తి బాగా పండుతుంది, కాని నేతలో ప్రావీణ్యం గల జాతులు దక్షిణాన ఉన్నాయి. ఒకే రాజ్యంగా ఉన్నప్పుడు ఉత్తర ప్రాంతపు పత్తి దక్షిణ ప్రాంతపు నేతగాళ్ళకు అందేది; దేశంలో మేలు రకం వస్త్రాల ఉత్పత్తి విస్తృతంగా సాగింది. కాని ఇప్పుడు ఉత్తర ప్రాంతపు రాజప్రతినిధి తన ప్రాంతంలో తయారయే పత్తిని దక్షిణానికి పోనివ్వక, తన ప్రాంతంలో వారినే నేత నేర్చుకోమన్నాడు. ఈ పరిస్థితిలో దక్షిణ ప్రాంత రాజప్రతినిధి, ఇతర పంటలు చక్కగా పండే పొలాలలో పత్తి పండించ సాగాడు. ఈ విధంగా, మంచి నేతగాళ్ళున్న చోట మంచి పత్తి లేకుండానూ, మంచి పత్తి ఉన్న చోట మంచి నేతగాళ్ళు లేకుండానూ పోయి, వస్త్రాల నాణ్యం బాగా దెబ్బతిన్నది.

ఇదే దుర్గతి లోహపరిశ్రమలకూ పట్టింది. దేశానికి తూర్పున మంచి గనులున్నాయి; పడమట నిపుణులైన లోహకారులున్నారు. కాని తూర్పు ప్రాంతపు రాజప్రతినిధి లోహాలను పడమరకు పోకుండా చేసి, లోహకారులను తన ప్రాంతంలోనే అభివృద్ధి చేసే ప్రయత్నం చేశాడు. పడమట ఉన్న రాజప్రతినిధి గత్యంతరం లేక పొరుగు దేశాల నుంచి డబ్బు పోసి లోహాలను కొనుక్కున్నాడు.

కేంద్రంలో ఉన్న రాజుకు రాజప్రతినిధులు పంపే నివేదికలు చూస్తే,



వారంతా దేశాన్ని అభివృద్ధికి తేవటానికి శక్తివంచన లేకుండా పాటుపడుతున్నట్టు కనిపించేది. వాళ్ళ చర్యలన్నీ సమంజసంగానే ఉన్నాయి, కాని దేశం అభివృద్ధి చెందటం లేదని ఆయనకు తెలుసును.

రాజప్రతినిధులను ఏర్పాటు చేసి అయిదేళ్ళు అయింది. దేశం వెనకటిలాగా అభివృద్ధి కాకపోగా, పూర్వం ఉండిన అభివృద్ధి క్రమంగా క్షీణించి, చివరకు స్తంభించిపోయింది.

దీనికి కారణం తెలుసుకోగోరి మణికంఠుడు రాజధానిలో మూడు రోజుల పాటు ఉత్సవాలు ఏర్పాటు చేసి, అందులో రకరకాల గోష్ఠులు ఏర్పాటు చేశాడు. ఒక గోష్ఠిలో వర్తకులు ప్రసంగిస్తూ, గడచిన అయిదేళ్ళలో దేశంలోని వర్తకం చాలా అభివృద్ధి అయిందన్నారు. అలాగే పరిశ్రమల వాళ్ళూ దేశమంతటా పరిశ్రమలు బాగా పెరిగాయన్నారు. ఇదంతా వింటున్న రాజుకు ఈ పెరుగుదలలు చూసి సంతోషించాలో దేశం అభివృద్ధి కాకపోవటానికి చింతించాలో తెలియలేదు.

ఒక రోజు పండిత గోష్ఠి కూడా జరిగింది. ఆ గోష్ఠిలో శశిభూషణు డనే పండితుడు అసాధారణ ప్రజ్ఞ చూపి, రాజుగారి నుంచి బహుమానం పొందాడు.

బహుమానం ఇస్తూ రాజు శశిభూషణుడితో, "పాండిత్యానికి సంబంధించిన విషయం కాదుగాని, నన్ను చాలా కాలంగా ఒక ప్రశ్న బాధిస్తున్నది. దానికి సమాధానం ఇవ్వగలరా?" అన్నాడు.

"అడగండి, శక్తికొద్దీ ప్రయత్నిస్తాను," అన్నాడు శశిభూషణుడు.

"ఈ ప్రపంచాన్ని దేవుడు సృష్టించాడు. అందుచేత దేవుడే అందరి కన్న గొప్పవాడంటాం. కాని దేవుడి కన్న గొప్పవారు ఎవరైనా ఉన్నారా?" అని రాజు అడిగాడు.

"లేకేం, దేవుడి కన్న గొప్పవాడు మనిషి," అన్నాడు శశిభూషణుడు.

రాజు తెల్లబోయి, "సమాధానం చెప్ప గానే మీ బాధ్యత తీరదు. అది సరి అయినదని నిరూపించుకోవాలి," అన్నాడు.

శశిభూషణుడు వినయంగా, "నేను అనుభవంతో ఈ సమాధానం చెప్పాను, మహారాజా. దేవుడు నా నుదట పాండిత్యం సంపాదించమని రాశాడు. దాని ఆధారంగా నేను ఉత్తర ప్రాంతంలో బోధకుడుగా యువకులకు విద్య చెబుతూ ఉండేవాణ్ణి. కాని నేను తూర్పు ప్రాంతానికి చెందిన వాణ్ణి కావటం చేత నా ఉద్యోగం ఊడింది. అందు చేత నేను నేర్చుకున్న విద్యను నలుగురికీ పంచి ఇచ్చే పని మానుకుని, ప్రస్తుతం వ్యవసాయం చేసుకుని జీవిస్తున్నాను. దేవుడు గీసిన గీతను మనిషి చెరిపేశాడు. ఇద్దరిలో ఎవరు గొప్పో తమరే చెప్పండి," అన్నాడు.

శశిభూషణుడి మాటలతో రాజుకు కనువిప్పు అయింది. ఏక రాజ్యంగా ఉండవలిసినది నాలుగు చిన్న దేశాలుగా మారిపోయింది.

దీన్ని గురించి రాజు తిరిగి మంత్రులతో చర్చించాడు. మంత్రులు ఈ సమస్యను క్షుణ్ణంగా చర్చించి, "మహారాజా, పెద్ద రాజ్యాన్ని చిన్న ఖండాలుగా విభజించటంలో తప్పు లేదు. ప్రాంతీయ దురభిమానాలు పెరగటానికి కారణం, ఏ ప్రాంతపు రాజప్రతినిధి ఆ ప్రాంతం వాడు కావటమే. రాజప్రతినిధులు దుర్మార్గులూ, అసమర్థులూ అనటానికి కూడా లేదు. కాని ఒక ప్రాంతం వాణ్ణి మరొక ప్రాంతానికి రాజప్రతినిధిగా వేస్తే ఈ దుస్థితి కలిగేది కాదు. వారికి స్థాన చలనం కలిగించండి. సమస్య పరిష్కారమవుతుంది. ప్రజలు తామంతా ఒక దేశం పౌరులమేనని తెలిసి మసులుకుంటారు. వివిధ ప్రాంతాల మధ్య పోటీ పోయి, సఖ్యత ఏర్పడుతుంది." అన్నారు.

రాజు అలాగే చేసి దేశం అభ్యున్నతిని సాధించేటట్టు చేశాడు.






ఒక ఊళ్ళో ఒక చిల్లర వర్తకుడు ఉండేవాడు. అతనికి పెద్ద వర్తకుడు కావాలన్న ఆశ ఉండేది.

ఒక రోజు అతను సరుకులు తెచ్చుకోవటానికి పట్నం పోతూ, ఎండ మరీ ఎక్కువగా ఉండటం చేత ఒక చెట్టు నీడన కూర్చుని, డబ్బు గురించి ఆలోచనలో పడ్డాడు.

ఇంతలో పై నుంచి, "నీకు ఏడు కుండల బంగారం కావాలా?" అన్న ప్రశ్న వినిపించింది.

వర్తకుడు ఆశ్చర్యంతో తలఎత్తి పైకి చూశాడు. కాని అతనికి ఎవరూ కనిపించలేదు. అయినా అతను సంతోషంతో చెట్టు పైకి చూస్తూ, "అయ్యా, మీరెవరో నాకు తెలీదు. నా మీద దయకలిగి, మీరు ఇంత ఉపకారం చేస్తానంటే, వద్దనటానికి నాకు నోరు వస్తుందా? ఏడు కుండల బంగారం అవశ్యం దయచేయించండి," అన్నాడు.

దీనికి జవాబుగా చెట్టు మీది నుంచి, "ఇంటికి వెళ్ళి చూసుకో. ఏడుకుండల బంగారం నీ యింట ఉంటుంది," అన్న మాటలు వినిపించాయి.

వర్తకుడు వెంటనే లేచి, పరిగెత్తుకుంటూ ఇంటికి వెళ్ళాడు. అతని ఇంట్లో నిజంగానే ఏడు కుండల బంగారం ఉన్నది. ఆరుకుండల నిండా బంగారం ఉన్నది గాని, ఏడవ కుండలో సగానికి మాత్రమే ఉన్నది. ఆరుకుండల నిండా బంగారం ఉన్నదని సంతోషించక, ఆ వర్తకుడు ఏడవ కుండలో బంగారం సగానికే ఉన్నందుకు దిగులుపడ్డాడు. ఆ ఏడవ కుండను బంగారంతో నించితే తప్ప ఆ మనిషికి ఆరాటం తగ్గేటట్టు కనపడలేదు.

అమ్ము భాస్కరమ్మ

అతను వెంటనే తన భార్య ఒంటి మీద ఉన్న బంగారు నగలన్నీ తీయించి కుండలో వేశాడు. కాని కుండ నిండలేదు.

ఆ వూళ్లోనే ఒక జమీందారున్నాడు. అతను వర్తకుడికి చిన్ననాటి స్నేహితుడు. వర్తకుడు ఆ జమీందారు వద్దకు వెళ్ళి, "ఆపదలో ఉన్నాను. అప్పుకావాలి," అని చెప్పి, సొమ్ము కొంత తీసుకుని, దానితో బంగారం కొని, కుండలో వేశాడు. కాని కుండ నిండలేదు.

అప్పుడు వర్తకుడు ఇంట్లో వంట మానిపించి, తన భార్యతోసహా గంజి తాగుతూ, కొంత డబ్బు మిగిల్చి, కొన గలిగినంత బంగారం కొని కుండలో వేశాడు. కాని కుండ నిండలేదు.

తరవాత వర్తకుడు గంజి తాగటం కూడా మాని, చిరిగిన బట్టలు కట్టుకుని ముష్టి ఎత్తటానికి బయలుదేరాడు.

ఒక రోజున ముష్టి ఎత్తుకుంటూ వర్తకుడు జమీందారుకు కనిపించాడు. అతను చింకి గుడ్డలు కట్టుకుని, చిక్కి శల్యమై ఉండటం చూసి జమీందారు ఆశ్చర్యపోయాడు. ఆస్తి అంతో ఇంతో ఉండగా అతను ముష్టి ఎందుకు ఎత్తు కుంటున్నాడో జమీందారుకు అర్థంగాక, "ఏంరా? కొంప తీసి ఏడు కుండలు పుచ్చుకున్నావా ఏమిటి?" అని అడిగాడు.

వర్తకుడు ఆశ్చర్యపోయి, "ఈ రహస్యం మీకెలాతెలిసింది?" అన్నాడు.

"ఇది పెద్దరహస్యం కాదు. ఏడు కుండలు పుచ్చుకున్న వాళ్ళను చాలా మందిని చూశాను. ఒక్కడూ బాగుపడ లేదు. వెంటనే వాటిని వదిలించుకో," అన్నాడు జమీందారు.

వెంటనే వర్తకుడు వెనకటి చెట్టు కిందికి పోయి, "నాకు ఏడుకుండలు వద్దు, మహాప్రభో!" అని అరిచాడు. అతను ఇంటికి తిరిగి వచ్చేసరికి ఇంట్లో ఏడుకుండలూ లేవు. వాటితోబాటు వర్త కుడు ఏడవకుండలో వేసిన బంగార మంతా పోయింది. దురాశ మూలాన అతను కట్టుబట్టలతో మిగిలాడు.





# గురుపీఠం

ఒకప్పుడు కాశీవిద్యాపీఠం దేశమంతటికీ అత్యున్నత విద్యాపీఠంగా ఉండేది. మాధవవర్మ కాలంలో ఆ పీఠానికి అధిపతి నిగమశర్మ అనే మహా పండితుడు. సకల శాస్త్ర పారంగతుడై ఉండి కూడా, ఆయన చిన్నమెత్తు గర్వం లేకుండా, తన వద్దకు వచ్చిన విద్యార్థులకు విద్యలు నేర్పుతూ ఉండే వాడు.

ఆయన వద్ద విద్యాభ్యాసం చేసిన శిష్యులలో రాజశేఖరుడు అనే వాడు ఒకడు. అతను మంచి తెలివి తేటలు గలవాడు. అయితే అతను గురుకులానికి వచ్చిన క్షణం నుంచీ అతని దృష్టి అంతా గురువుగారి పదవి మీదనే ఉంటూ వచ్చింది. అతను తన సహాధ్యాయులతో కలిసి తిరిగే వాడు కాడు. అయినా అధ్యయనంలో అతను అందరినీ మించి ఉండే వాడు.

విద్యాభ్యాసం పూర్తి కావస్తున్న కొద్దీ రాజశేఖరుడికి గురుపీఠం మీది వాంఛ తీవ్రంకా సాగింది. ఏ విధంగా నైనా తాను తన గురువు స్థానం ఆక్రమించాలని అతను దృఢంగా నిశ్చయించుకున్నాడు.

విద్యాభ్యాసం పూర్తి కాగానే శిష్యులందరూ తమ తమ ఇళ్ళకు వెళ్ళి పోయారు. రాజశేఖరుడు మాత్రం ఇంటికి వెళ్ళక, దేశాటనానికి బయలుదేరాడు. వివిధ దేశాలు తిరిగి తాను నేర్చుకోవలసినది ఇంకా ఏమైనా దిగబడి ఉంటే ఆ లోటు భర్తీ చేసుకోవాలని అతని ఉద్దేశం.

ఈ ఉద్దేశం కూడా నెరవేరి, తన పాండిత్యం పరిపూర్ణ మయిందని తోచినాక, రాజశేఖరుడు వివిధ ఆస్థానాలకు వెళ్ళి, అక్కడి పండితులతో చర్చలు జరిపి, ఆ పండితు లెవరూ పాండిత్యంలో

"అపర్ణ"



తనకన్న మించినవారు కారని రూఢి చేసుకున్నాడు.

ఆ తరవాత అతను తిరిగి కాశీరాజ్యానికి వచ్చి, మాధవవర్మ కొలువు తీరి ఉండగా సభకు వచ్చి, "మహారాజా, నేను సకల శాస్త్రాలూ చదివిన పండితుణ్ణి; అనేక దేశాలు తిరిగి ఎందరో పండితులను చూశాను. నన్ను మించగల పండితులు నా కెక్కడా కానరాలేదు. అలాటి వారు మీ సభలో ఎవరన్నా ఉన్నారేమో తెలుసుకుందామని వచ్చాను," అన్నాడు.

తన ఆస్థాన పండితులతో రాజశేఖరుడు పండిత చర్చలు జరపటానికి రాజు అంగీకరించి, అవకాశం కలిగించాడు. చర్చలలో రాజశేఖరుడె అందరికన్న మిన్న అని రుజువు చేసుకున్నాడు. దానితో అతని అహంకారం మరింత రెచ్చిపోయింది.

అతను మాధవవర్మతో, "మహారాజా, నా అధిక్యత రుజువు చేసుకున్నాను గదా. నాకు కాశీవిద్యా పీఠాధిపత్యం దయచేయించండి," అన్నాడు.

రాజు నిగమశర్మను పిలిపించి, రాజశేఖరుడి కోరిక తెలిపాడు. నిగమశర్మ రాజశేఖరుడితో, "నాయనా, ఆస్థాన పండితుల నందరినీ ఓడించి, గురుపీఠం కోరావట, చాలా సంతోషం! కాని ఆ గురుపీఠానికీ, నీకూ మధ్య నేనొకణ్ణి అడ్డున్నాను గద! నన్ను కూడా ఓడించి గురుపీఠాన్ని సంపాదించు," అన్నాడు.

మర్నాడు నిగమశర్మకూ, రాజశేఖరుడికీ పోటీ ఏర్పాటయింది. వాగ్వాదంలో కొద్దిసేపు రాజశేఖరుడు పైచేయి అయినట్టు కనిపించాడు గాని, పోను పోను అతని ఉత్సాహం సన్నగిల్లినట్లు కనిపించింది. చివరలో నిగమశర్మ వేసిన అనేక ప్రశ్నలకు రాజశేఖరుడు సమాధానాలు కూడా చెప్పలేక పోయాడు. సభలో అందరూ నిగమశర్మను హర్షిస్తూ మెచ్చుకున్నారు.

కిందటి రోజు ఇదే సభలో విజయ గర్వంతో విర్రవీగిన రాజశేఖరుడికి ఈనాడు దుర్భరమైన పరాభవం కలిగింది. అతను చివాలున లేచి, తల వంచుకుని మౌనంగా సభనుంచి బయిటికి వెళ్ళిపోయాడు.

ఆ పోవడం అతను తిన్నగా హిమాలయాలకు వెళ్ళి, అతి కఠోర దీక్షతో రెండేళ్ళపాటు సరస్వతిని గురించి తపస్సు చేశాడు. సరస్వతీదేవి ప్రత్యక్షమై, అతనికి సంపూర్ణ జ్ఞానాన్ని ప్రసాదించింది.

వెంటనే రాజశేఖరుడిలో ఒక విచిత్రమైన మార్పు వచ్చింది. అతను అప్పటికప్పుడే బయలుదేరి కాశీరాజ్యానికి తిరిగి వచ్చి, విద్యాపీఠానికి వెళ్ళి, నిగమశర్మ కాళ్ళమీద పడి, అజ్ఞానం మూలంగా కలిగిన తన అహంకారాన్ని క్షమించమని వేడుకున్నాడు.

నిగమశర్మ అతన్ని లేవనెత్తి, "నాయనా, రాజశేఖరా, నువు విద్యార్థిగా ఉంటూనే చదువు మీద కన్న, గురుపీఠం మీద ఎక్కువ లక్ష్యం ఉంచావు. ఆ సంగతి నాకు తెలుసు. అందరినీ మించిన తెలివితేటలుండి కూడా నువు సంపూర్ణ జ్ఞానాన్ని పొందలేక పోవటానికి అదే కారణం. అహంకారం కూడా అజ్ఞానం మూలంగానే కలుగుతుంది. నీ అహంకారం పోవటం చూస్తే నీ జ్ఞానం పరిపూర్ణమైనట్టు కనబడుతుంది. అందుకే నీకు వినయం అబ్బింది," అన్నాడు.

ఆయన మర్నాడు రాజశేఖరుణ్ణి వెంటబెట్టుకుని మాధవవర్మ వద్దకు వెళ్ళి, "మహారాజా, ఇతనే కాశీ విద్యాపీఠానికి కొత్త అధిపతి. యువకుడూ, నన్ను మించిన వాడూనూ. నేను వృద్ధుణ్ణి అయిపోయాను. వానప్రస్థం పోదలిచాను," అన్నాడు.

నిగమశర్మ కోరిన విధంగా రాజు రాజశేఖరుణ్ణి కాశీవిద్యా పీఠానికి అధిపతిగా నియమించాడు.






# సోమనాథుడి మహిమ

సప్తగఢ్ రాజు కొడుకైన స్వర్ణకుమారుడు రాజోద్యానంలో తిరుగుతూండగా అతన్ని తుమ్మెద కుట్టింది. రాజుకూ, రాణికీ చాలాకాలం పిల్లలు లేక వార్ధక్యంలో పుట్టిన స్వర్ణకుమారుణ్ణి వాళ్ళు ప్రాణంగా చూసుకునే వారు. వాడికి ఇప్పుడు ఎనిమిదేళ్ళు. వాడు క్షణంసేపు కళ్ళ ఎదట లేక పోతే వాళ్ళు తపించిపోతారు. స్వర్ణకుమారుడు తన తల్లి దండ్రులతో కలిసి ఉద్యానంలో నడుస్తూ ఉండగా నల్లని తుమ్మెద వాణ్ణి కుట్టింది. వాడు బాధకు ఏడవసాగాడు. నౌకర్లు వెంటనే వాణ్ణి రాజభవనంలోకి తీసుకుపోయి, ఆస్థానవైద్యుడి చేత చికిత్స చేయించారు. మందులు పనిచేసి కుర్రవాడు కొంత సేపటికి ఉపశమనం పొందాడు.

ఆ రాత్రి రాణికి ఒక వింత కల వచ్చింది. కలలో ఆమెకు ఒక దేవత కనిపించి, "రాణీ, నీ కొడుకును గురించి జాగ్రత్తపడు. వాణ్ణి కుట్టినది మామూలు తుమ్మెద కాదు, శాపం పొందిన రాక్షసి. దాని కాటు ఎటువంటిదంటే, అది కుట్టిన వాడు క్రమంగా క్షీణించి, రోజుకు ఒక తులం చొప్పున బరువు తగ్గుతూ, చివరకు అస్థిపంజరం అయిపోతాడు. కావాలంటే నీ కొడుకు బరువు మంచి త్రాసుతో రోజూ పరీక్షించు, నిజం నీకే తెలుస్తుంది," అన్నది.

"దీనికి విరుగుడు ఏమిటి?" అని రాణి అడిగింది.

కాని ఆ ప్రశ్నకు సమాధానం చెప్ప కుండానే దేవత అంతర్ధాన మయింది.

రాణి అదిరిపడి లేచి, రాజును లేపి తన కల గురించి చెప్పింది.

"అదంతా నిజం అనుకోకు. కలలు కలలే," అన్నాడు రాజు.

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

రాణికి మనశ్శాంతి లేక పోయింది. మర్నాడు ఉదయం ఆమె తన కుమారుణ్ణి తూయించింది. మరి రెండు రోజుల అనంతరం తిరిగి తూస్తే, కుర్రవాడి బరువు మూడు తులాలు తరిగినట్టు స్పష్టమయింది. అది మొదలు స్వర్ణకుమారుడు రోజుకొక తులం చొప్పున కృశించిపోతూ వచ్చాడు. కల నిజమయింది!

పౌరులకూ, రాజోద్యోగులకూ, రాజు కుటుంబానికీ తీరని విచారం పట్టుకున్నది. స్వర్ణకుమారుడికి ఎన్నో చికిత్సలు చేశారు, ఎన్నో వ్రతాలూ, శాంతులూ చేశారు, పూజలూ, ప్రార్థనలు జరిపించారు. కాని రాజకుమారుడి స్థితిలో ఎట్టి మార్పు లేదు. అతను కృశించటం మానలేదు.

ఆ దేశానికి చెందిన కీకారణ్య మధ్యంలో చండపాణి అనే తాంత్రికుడు నివసించే వాడు. అతను భూత పిశాచాలను వదిలించటంలో ఘటికుడు. ఒక నాడు రాజుగారి మనుషులు అయన వద్దకు వెళ్ళి, ఒక్కసారి రాజభవనానికి రమ్మనీ, రాజకుమారుడి వ్యాధి నయం చెయ్యమనీ కోరారు. అయనను రాజభవనానికి రప్పించటానికి అవసరమైన ఏర్పాట్లు జరిగాయి.



శనివారం అర్థరాత్రి తాను వస్తాననీ, వెయ్యి మందికి షడ్రసోపేతమైన భోజనం తయారుగా ఉంచమనీ, నగరంలో ప్రజలు తమ పక్కలు వదిలి వీధులలోకి రాగూడదనీ, వీధులలో దీపాలు వెలగ రాదనీ అయన ముందుగా రాజును హెచ్చరించాడు.

అనుకున్న సమయానికి చండపాణి ఒక పల్లకీలో వచ్చాడు. ఆ పల్లకీని ఆరు అస్థిపంజరాలు రాజభవనానికి మోసుకు వచ్చాయి. పల్లకీ వెనక వందల కొద్దీ అస్థిపంజరాలు నడిచి వచ్చాయి. రాజ భవనం ఆవరణలో వెయ్యి అస్థిపంజరాలు విందు కుడిచి, తెల్లవారిన దాకా అనం



దంతో నృత్యాలు చేసి, ఖాళీ పల్లకీతో సహా వెళ్ళిపోయాయి.

తరవాత చండపాణి రాజభవనం ప్రవేశించి, "రాజు ఎక్కడ? నేను వచ్చాను, బయటికి వచ్చి స్వాగతం చెప్పమను," అన్నాడు.

రాజు తన పరివారంతో ముందుకు వచ్చి, "నేను తమ కోసమే వేచి ఉన్నాను, మహాత్మా, దయ చెయ్యండి," అన్నాడు.

"నీ కొడుకు ఏడీ? నేను వాణ్ణి ముందు చూడాలి," అన్నాడు చండపాణి.

ఆయనను రాజకుమారుడి గదికి తీసుకు వెళ్ళారు. చండపాణి గాలి మూచూస్తూ, "అవును, నేను ముందే అనుకున్నాను. ఆ పిశాచిముండ, పాపం, ఈ కుర్రవాడి మీద ఆవహించింది. దాన్ని వదిలి పెట్టను, మారణహోమం చేస్తాను," అని రాజుకేసి తిరిగి, "ఇంత పని చేసిన ఆ పిశాచి కథ మీ రంతా వినాలి. చెబుతాను వినండి," అంటూ ఇలా చెప్పాడు:

"సిద్ధవనంలో పూర్వం ఒక రాకసి ఉండేది. దానికి హీతి అని ఒక కూతురు ఉండేది. అది చాలా పాపిష్ఠిది. ఆ సమయంలో నేనా అరణ్యంలో సమాధిలో ఉండగా, హీతి వచ్చి నా సమాధిని భంగం చెయ్యాలని చూసింది. నేను పదే పదే హెచ్చరించినా కూడా లక్ష్యపెట్టక అది నా నిష్ఠకు భంగం కలిగిస్తూ వచ్చింది. నేను దాన్ని శపించి, మనిషి తలగల గేదెగా మార్చాను. అప్పటికీ అది నా జోలికి రావటం మానలేదు. మరింత కోపంవచ్చి నేను దాన్ని నల్ల తుమ్మెదగా మార్చి, ఈ దేశానికి పార దోలాను. దాని దుర్బుద్ధి ఇంకా పోలేదు; ఈ రాజకుమారుణ్ణి కుట్టింది. అయితే అది చాలా కాలం శిక్ష అనుభవించింది. ఎవరికీ ఎలాటి అపకారమూ చేయవద్దని హెచ్చరించి, దానికి విముక్తి కలిగించాలి. నేను దాన్ని పిలిచి, రాజకుమారుడి

జబ్బుకు ఏదైనా మందు ఉన్నదేమో తెలుసుకుంటాను.''

ఇలా అని చండపాణి అగ్నిహోత్రం చేసి అందులో సువాసన ద్రవ్యాలు వేశాడు. పొగ పైపైకి లేచింది. చండపాణి ఏదో మంత్రం చదివే సరికి ఆ పొగ కూడుకుని ఒక స్తంభం ఆకారం పొందింది. ఒక నల్లని తుమ్మెద లోపలికి ఎగురుతూ వచ్చింది.

చండపాణి దానితో, ''పాపిష్ఠి దానా, నువు ఇంకా నీ దుర్బుద్ధి మానావు కావు. అన్యాయంగా ఈ రాజకుమారుణ్ణి కుట్టావు.'' అన్నాడు.

తుమ్మెద మనిషి వాక్కుతో, ''క్షమించండి, మహాత్మా! మిమ్మల్ని ఇక్కడికి రప్పించటానికే నేను రాజకుమారుణ్ణి కుట్టాను. తమరు రానే వచ్చారు గనక నేను రాజకుమారుడికి చికిత్స చెబుతాను. అగ్నిగుల్మం రసం రోజు కొక లోటాడు చొప్పున వారం రోజులు ఇచ్చినట్టయితే రాజకుమారుడికి స్వస్థత కలుగుతుంది. స్వామీ, రాజకుమారుడి వ్యాధి నివారణ అయినాక నా యథారూపం నాకు దయ చేయించండి,'' అన్నది.

''అలాగే చేస్తాను. రాజకుమారుడికి ఆరోగ్యం కలిగినాక నీకు శాపవిమోచన కలుగుతుంది,'' అన్నాడు చండపాణి.

తుమ్మెద ఆయన పాదాల మీద వాలి, ఝుంకారం చేస్తూ గదిలోనుంచి బయిటికి ఎగిరిపోయింది.





చండపాణి ఆస్థానవైద్యుణ్ణి పిలిపించి, "నీకు అగ్నిగుల్మం తెలుసు కద ?" అన్నాడు.

"తెలుసును, స్వామీ. మా మూలికా క్షేత్రంలో అది పుష్కలంగా పెరుగుతున్నది," అన్నాడు వైద్యుడు.

"సరే, అయితే తుమ్మెద చెప్పిన విధంగా కుర్రవాడికి చికిత్స జరిపించండి. వాడికి త్వరలోనే స్వస్థత కలగాలని ఆశీర్వదిస్తున్నాను. ఇక నన్ను బాధించకండి," అంటూ చండపాణి, అందరూ చూస్తూండగానే అంతర్ధానమయాడు.

అగ్నిగుల్మం తెచ్చి, రసం పిండి, గాజులోటాలో పోసి, రాజకుమారుడి చేత తాగించటానికి వైద్యుడు రాజకుమారుదున్న గదికి వెళ్ళాడు. ఆయన లోటాను రాజకుమారుడి ముందుపెట్టి, "బాబూ, ఇది తాగండి. మీ జబ్బు నయం అవుతుంది," అన్నాడు.

లోటా లోని రసం నల్లసిరా లాగున్నది. రాజకుమారు దానికేసి చూసి ముఖం అసహ్యంగా పెట్టి, "ఛీ ఛీ, అవతలికి తీసుకుపోండి. ఆ నల్ల కషాయం నేను తాగను. నా దగ్గిరికి తేకండి!" అన్నాడు.

రాజకుమారుడికి అసలు నలుపు అంటేనే తగని అసహ్యం. రాజూ, రాణీ ఎంత బుజ్జగించి చెప్పినా కుర్రవాడు విన్నాడు కాడు. వాడిచేత ఆ నల్లని రసం ఎలా తాగించాలో ఎవరికీ తెలియలేదు. దానిలో మరేదన్నా చేర్చి రంగు మార్చితే ఔషధగుణం మారిపోవచ్చు.

రెండు రోజులు గడిచాయి. రాజకుమారుడి బరువు మరి రెండు తులాలు తరిగి పోయింది. సభలో రెండు రోజులూ ఈ సమస్య గురించే చర్చలు జరిగాయి. మూడోరోజు చర్చలో ఆస్థాన ఇంద్రజాలికుడు సోమనాధుడు రాజుగారిని, "నాకు ఒక అవకాశం ఇచ్చి చూడండి," అన్నాడు.

"నీ ఇంద్రజాలం పని చేస్తుందా ?" అని రాజు సోమనాధుణ్ణి అడిగాడు.

"ప్రయత్నించి చూస్తే నష్టమేమిటి, మహారాజా?" అన్నాడు సోమనాధుడు.

"సరే, ప్రయత్నించి చూడు. నీ ప్రయత్నం ఫలిస్తే మంచి బహుమానం ఇస్తా," అన్నాడు రాజు.

"ఇప్పుడే ప్రయత్నం ఆరంభిస్తాను, మహారాజా," అన్నాడు సోమనాధుడు.

స్వర్ణకుమారుడికి సోమనాధుడంటే చాలా ఇష్టం, ఎందుకంటే అతను అద్భుతమైన ఇంద్రజాల విద్యలు చూపుతాడు. కాని, సోమనాధుడు గాజులోటాలో నల్లని రసం పోసుకుని తన గదిలోకి రావటం చూసి స్వర్ణకుమారుడు, "నువ్వు కూడా ఆ దిక్కుమాలిన కషాయం తెచ్చావా, సోమనాథ్? దాన్ని అవతల పారబొయ్యి. నీకు పుణ్యం ఉంటుంది. అంతకన్న ఏదన్నా ఇంద్రజాలం చెయ్యి, ఆనందిస్తాను," అన్నాడు.

"నువ్వు పొరబడ్డావు, బాబూ. అందరిలాగా నేను నిన్ను విసిగిస్తానా? నేను వచ్చింది ఇంద్రజాలం చెయ్యటానికే!" అన్నాడు సోమనాధుడు.

"అబద్ధం! మీరంతా కుట్ర పన్ని నా చేత ఆ దిక్కుమాలిన సిరా తాగించాలని చూస్తున్నారు," అంటూ రాజకుమారుడు ఏడవసాగాడు.

"నువ్వు పొరబడ్డావు. నువ్వు సిరా అనేది సిరా కానేకాదు. ఆ సంగతి నీకు చూపిస్తాను. ఈ లోటా కేసి చూడు," అంటూ సోమనాధుడు లోటాను ఎత్తుగా



పట్టుకుని, జేబులో నుంచి ఒక నల్లని చేతిరుమాలు తీసి లోటా మీద కప్పి, ఏదో మంత్రం చదువుతూ లోటాను అన్ని వైపులా తుడిచాడు. ఇలా కొంతసేపు చేసి, అతను చేతిరుమాలు తీసేశాడు. రాజకుమారుడు కళ్లు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూశాడు. లోటాలో సిరాలేదు— సిరా అంతా మిఠాయి సరుకుగామారింది. సోమనాథుడు ఆ మిఠాయి ఇస్తే, రాజకుమారుడు సంతోషంగా తిన్నాడు.

"చూశావా, బాబూ? మందు నల్లగా ఉన్నప్పటికీ, నువ్వు అనుకున్నట్టు అసహ్యమైనది కాదు. నిజానికి అది మిఠాయి దినుసు. నువ్వు ఇక నల్లనిమందు తాగటానికి అభ్యంతరం చెప్ప వనుకుంటాను," అన్నాడు సోమనాథుడు.

రాజకుమారుడు పేచీ పెడుతూ, "నువే ఇచ్చేటట్టుంటె తాగుతాను," అన్నాడు.

మర్నాడు సోమనాథుడి చేతిమీదుగా ఇస్తే రాజకుమారుడు మందు తాగటం చూసి అందరూ నివ్వెరపోయారు. అలాగే రాజకుమారుడు వారం రోజులూ మందు తాగి, త్వరలోనే కోలుకున్నాడు. సోమనాథుడికి రాజు సగౌరవంగా ధనమూ, నగలూ ఇచ్చాడు.

సోమనాథుడు వాటిని తీసుకుపోయి తన భార్యకు చూపాడు. అతని భార్య అతను చేసిన ఇంద్రజాలం గురించి అడిగింది. సోమనాథుడు ఇలా చెప్పాడు:

"గాజులోటా వెలపల అంతటా దట్టంగా నూనెదీపం పొగమసి పట్టించి, లోటా ఎగువన ఒక అంగుళం మేర మసి తుడిచేశాను. తరవాత లోటాలో సగానికి మిఠాయి దినుసులు వేశాను. లోటాను మసిలేని పై భాగంలో పట్టుకుని రాజకుమారుడి వద్దకు వెళ్ళాను. అతనికి లోటా మీది మసి మందులాగా కనిపించింది. లోటా మీద నల్లరుమాలు కప్పి, మంత్రం చదువుతూ మసి అంతా తుడిచేశాను. రుమాలు నల్లది గనక మరక తెలియదు. తెలిసింది కాదూ?"



# సుబ్బిశెట్టి తెలివి

వేదాయపాలెం అనే గ్రామంలో ఒకసారి దొంగల బాధ యెక్కువైంది. ఏ యిల్లూ దొంగల దాడి నుంచి తప్పించుకోలేకపోయింది. చివరికి, యెలాగైతేనేం, రాజుగారు త్వరితంగా కల్పించుకోవటం వలన దొంగలు పట్టుబడిపోయారు.

తరువాత గ్రామ ప్రజలందరికీ ఒక విషయం తెలిసింది. అదేమంటే, దొంగలు అందరి యిళ్ళనూ దోచారు గాని సుబ్బిశెట్టి యిల్లు మాత్రం దోచలేదని. గ్రామస్థులందరికీ ఆశ్చర్యం వేసింది. వాళ్ళు అదే సుబ్బిశెట్టి నడిగారు.

"ఏమయ్యా, సుబ్బిశెట్టి, దొంగలబారి పడకుండా చాలా గట్టి బందోబస్తు చేయించుకున్నట్లున్నావే? ఏమిటా బందోబస్తు? మాకూడా కొంచెం చెప్పవయ్యా," అన్నారు.

అందుకు సుబ్బిశెట్టి పెద్దగా నవ్వి, "ఏమీ లేదు. మీరంతా తలుపులు బిడాయించుకొని పడుకుంటే నేను తలుపులు బార్లా తెరిచి, సుఖంగా నిద్రపోయాను. నా ప్రవర్తన చూసి దొంగలకు అనుమానం వచ్చి నా జోలికనలు రాలేదు," అన్నాడు.

గ్రామస్థులు నిశ్చేష్టులయ్యారు. —మునీర్.





# వివేకవ్యాపారి

ఒక ఊళ్ళో రామయ్య అనే అతను కోమటి గుమాస్తాగా ఉండేవాడు. అతను వ్యాపార విషయాలలో మంచి చురుకూ, అనుభవమూ కలవాడు, దానికి తోడు మంచి నిజాయితీ పరుడు. తన యజమాని ఉప్పు తింటున్నందుకు, ఆ యజమానికి వీలయినంత లాభాలు గడించి పెట్టాలని రామయ్య ఉద్దేశం. ఏ వస్తువు ఎక్కడ చౌకగా దొరుకు తున్నదని తెలిస్తే అక్కడికి వెళ్ళి, ఆ వస్తువు కొనుగోలు చేసి తెచ్చి, మంచి ధరలకు అమ్మేవాడు. అదే విధంగా వ్యాపారంలో సాదర ఖర్చులు తగ్గించటంలో కూడా రామయ్య ఎంతో మెళుకువ చూపేవాడు.

కాని కొంత కాలానికి రామయ్య యజమాని చనిపోయి, పెత్తనం అతని కొడుకైన రంగయ్యకు వచ్చింది. రంగయ్య దూరదృష్టి లేని వాడు. పిసినిగొట్టు. ఖర్చులు తగ్గిస్తే లాభాలు ఎక్కువ అవుతాయని అతని ఉద్దేశం. అవసరమైన ఖర్చులేవో అతనికి తెలియదు. అతను పొదుపు కార్యక్రమంలో రామయ్య జీతం తగ్గించి, అతనికి పని పెంచాడు. తాను చెప్పిన పనులు తాను అనుకున్నట్టు జరగకపోతే, రంగయ్య రామయ్యను నోటికి వచ్చినట్టు అనేవాడు. కాని రామయ్య ఓర్పు వహించి రంగయ్య కింద పని చేస్తూ వచ్చాడు.

అయితే రంగయ్యకు రామయ్య మీద అనుమానం పెరిగిపోయింది. చాలా ఏళ్ళుగా రామయ్య ఒక్కడి చేతి మీదుగానే తన తండ్రి వ్యాపారం లాభసాటిగా నడిచిందని అతనికి తెలుసు. ఆ అవకాశం చూసుకుని రామయ్య చాలా కాజేసి ఉండాలని రంగయ్య అనుకున్నాడు. అందు చేత అతను

కె. ఎం. డి. ఫిదాహుసేన్

రామయ్యను పనినుంచి తొలగిస్తూ, గిడ్డంగిలో పది మూటల ధాన్యం తరుగు కనిపిస్తున్నదనీ, మూడు రోజుల లోపల రామయ్య ఆ తరుగు ధాన్యం సొమ్ము ఇచ్చుకోవాలనీ, లేకపోతే అధికారులకు ఫిర్యాదు చేస్తాననీ చెప్పాడు.

ఇదంతా చూసి రామయ్య చాలా బాధ పడ్డాడు. తన వల్ల ఏ లోపం జరిగిందని రంగయ్య తనను తొలగించాడో, తనకు దొంగతనం ఎందుకు అంట గట్టాడో, తాను ఏమి చెయ్యాలో అతనికి ఎంత ఆలోచించినా తోచలేదు.

ఇదే సమయంలో రంగయ్య వద్దకు ఒక విదేశీ వర్తకుడు వచ్చి, "అయ్యా, నేను ద్వీపాంతరాల నుంచి వచ్చాను. ఇక్కడ దొరికే వస్తువులు కొంటున్నాను. మీ వద్ద నాకు పనికివచ్చే సరుకు ఉన్నట్టయితే కొంటాను. కాని నా వద్ద మీ దేశపు ధనం లేదు. అందుచేత బంగారపు అచ్చులిస్తాను. నేను కోరిన సరుకు అయితే మీరు కోరిన ధర ఇచ్చేస్తాను," అన్నాడు.

రంగయ్యకు ఈ మాట వినగానే పట్టరాని ఆనందం కలిగింది. మామూలుగా అయితే ఇలాటి బేరాలన్నీ రామయ్య చూసేవాడు, బహుశా బోలెడంత డబ్బు జేబులో వేసుకుని ఉండేవాడు. రామయ్యను ఉద్యోగం నుంచి తీసెయ్యటం ఎంతో లాభమయింది, అనుకున్నాడు రంగయ్య.



ఆ రాత్రికి రాత్రే విదేశీ వర్తకుడు తనకు కావలిసిన సరుకులన్నీ కొనేసి, బంగారపు అచ్చులు సంచీలో ఎంచి పోసి, సంచీని రంగయ్య చేతికిచ్చి, సరుకు పట్టించుకుని వెళ్ళిపోయాడు. రంగయ్య ఆ రాత్రి నిద్రలో మంచి కలలు కన్నాడు.

కాని మర్నాడు నిద్రలేస్తూనే అతనికి అనుమానం కలిగింది: విదేశీ వ్యాపారి ఇచ్చిన బంగారం మంచిదేనా? అందులో కల్తీ ఉండదు గద? ఈ సందేహం తీర్చుకునేటందుకు రంగయ్య ఒక బంగారపు అచ్చును తీసుకుపోయి కంసాలికి చూపించాడు. కంసాలి దానిని పరీక్షించి, అది బంగారం కాదనీ, బంగారు పూత పూసిన ఇత్తడి అనీ చెప్పాడు. రంగయ్య అక్కడే మూర్ఛపోయాడు.

ఇంతకూ ఈ విదేశీ వ్యాపారి వేషం వేసుకుని వచ్చినవాడు రామయ్య కొడుకు. తన తండ్రికి రంగయ్య చేసిన ద్రోహానికి ప్రతిక్రియ చేయాలని అతను అలా చేశాడు. అతను ఇంటికి తిరిగివచ్చి రామయ్యతో తాను చేసిన పని చెప్పాడు. రామయ్య కోప్పడ్డాడు.

"నీ నిజాయితీ నీకు ఏం ఒరిగించింది? ఎటువంటి వాడితో ఎట్లా వ్యవహరించాలో తెలియాలి," అన్నాడు రామయ్య కొడుకు.

రామయ్య స్వభావం ఇతరుల స్వభావాన్ని బట్టి మారేది కాదు. ఆయన మర్నాడు రంగయ్య సరుకు నంతా తీసుకుని రంగయ్య వద్దకు వెళ్ళాడు. నెత్తిన చేతులు పెట్టుకుని కూర్చున్న రంగయ్య, తన సరుకంతా తిరిగి వచ్చిందని తెలియగానే ఎంతో సంతోషించి, రామయ్య చెబుతున్న క్షమాపణలు వినిపించుకోక, "ఆహా, నువు ఎంత నిజాయితీ పరుడివి, రామయ్యా! నిన్న నువు ఉంటే ఇలా దగా పడిపోను గద! ఏమిటో అనుకున్నాను గాని, నువు లేకుండా వ్యాపారం సాగదు. యథాప్రకారం నువే దీన్ని చూసుకుంటూ ఉండు!" అన్నాడు.





# జీవనోపాధి

ఒక గ్రామంలో సోమయ్యా అనే రైతు ఉండే వాడు. అతడు గొర్రెలను అమ్మి బోలెడంత డబ్బు పోగుచేశాడు. అతనికి తన పొలంలో బావి తవ్వించాలని ఆలోచన ఉండేది. కాని, ఎంతో కాలంగా పోగుచేసి దాచిన డబ్బు తీసి, నీటి కోసం ఖర్చు చెయ్యటానికి మనసు రాక అతను ఆ ఆలోచనను అమలు చేయలేదు.

ఇంతలో కరువు వచ్చింది. నీటికి గిరాకీ హెచ్చింది. ప్రజలు తిండికి లేక బాధ పడుతున్నారు. బావి తవ్వించటానికి ఇదే సమయమని సోమయ్య అనుకున్నాడు. ఎందుకంటే కూలీలు, ఎంత మంది కావాలంటే అంత మంది, చౌకగా దొరుకుతారు. ఇలాటి సమయంలో పెట్టిన మదుపు రెట్టింపు ఆదాయాన్ని ఇస్తుంది.

సోమయ్య తన వద్ద చాలా కాలంగా మూలుగుతున్న డబ్బు పైకి తీశాడు. వడ్డెవారిని పిలిపించి, వాళ్ళ నాయకుడితో బావి తవ్వే ఏర్పాట్లన్నీ చేసుకున్నాడు.

కరువు రోజుల్లో పని దొరికింది గదా అన్న సంతోషంతో వడ్డెవాళ్ళు బావి పని ఉత్సాహంగా ప్రారంభించారు. రెండు నిలువుల లోతు తవ్వకం జరిగే సరికి బండ పడింది.

సోమయ్యకు గుండెలు గుభేలుమన్నాయి. డబ్బు వృథా అయినందుకు అతను నెత్తిన చెయ్యి పెట్టుకున్నాడు.

వడ్డెవాళ్ళకు కూడా పని నిలిచిపోతుందేమోనని భయం పట్టుకున్నది. ఒకటి రెండు నెలలు పని ఉంటే వాళ్ళు కరువు నుంచి బయట పడతారు.

వాళ్ళు భయపడినట్టే సోమయ్య, ఇంక పని చాలునన్నాడు.

"ఈ బండ ఎంతోలేదు. ఒక్క పార మాత్రమే. దానికింద బ్రహ్మాండమైన నీటి

సూళభి రేవతి

బుగ్గ ఉన్నది. రేపు ఉదయానికి రెండడుగుల నీరు రావచ్చు. ఇప్పుడు పని నిలపకండి," అన్నాడు వడ్డెనాయకుడు.

సోమయ్య ఏమీ అనకుండా ఇంటికి పోయాడు.

ఆ రాత్రి వడ్డె నాయకుడికి నిద్ర పట్టలేదు. ఎలాగైనా తన వాళ్ళకు నాలుగు డబ్బులు ముట్టేటట్టుచేయటం ఎలాగా అని అతను చాలాసేపు ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చాడు. అతను వెంటనే లేచి, తన వాళ్ళ నందరినీ పిలిచి, తలా ఒక కడవా ఇచ్చి, ఏ గుంటలో దొరికిన నీరైనా సరే తెచ్చి బావిలో పొయ్యమన్నాడు. వాళ్లు బావిలో మూరెడులోతు ఉండేటట్టుగా నీరు పోసి వెళ్ళిపోయారు. అడుగున బండ ఉండటం చేత ఆ నీరు ఇంకి పోలేదు.

సోమయ్య మర్నాడు ఉదయం అలవాటు చొప్పున బావి వద్దకువెళ్ళి చూసేసరికి నీరు కనిపించింది. అతను ఎగిరి గంతేసి, అడావుడిగా వడ్డెనాయకుడి ఇంటికి వెళ్ళి, "నువ్వన్నది నిజం! బావిలో నీరు పడింది. పని నిలపను. రండి, పని సాగించండి," అన్నాడు.

"లేదు, సోమయ్యగారూ. మే మంతా మరో గ్రామం వెళదామనుకున్నాం. అక్కడ మాకు బోలెడంత పని దొరుకుతున్నది. ఇంకెవరితో నైనా పని చేయించుకోండి." అన్నాడు వడ్డెనాయకుడు బెట్టుగా.

"అలాకాదు. ఈ పని మీ చేతిమీదుగానే కావాలి," అని సోమయ్య నాయకుణ్ణి బతిమాలాడు.

"అయితే, డబ్బు ముందుగానే ఇచ్చే ఏర్పాటు చెయ్యండి. లేకపోతే మా వాళ్ళు నా మాట వినరు," అన్నాడు నాయకుడు.

మరో రెండు నిలువులలోతు తవ్వటానికి అయే కూలి లెక్కగట్టి, సోమయ్య నాయకుడికి డబ్బిచ్చాడు. వడ్డెవాళ్ళు లెక్కప్రకారం రెండు నిలువులరాయీ పగల గొట్టారు. మొదట కనిపించిన నీరు ఎప్పుడో ఇంకిపోయింది. ఆ తరవాత అది కనిపించలేదు. బండ తరగనూలేదు. వడ్డెవాళ్ళకు మాత్రం కరువురోజుల్లో జీవనోపాధి దొరికింది.






యుద్ధం చాలా తీవ్రంగా ఉన్నది. తన కొడుకైన ఇరావంతుడు చనిపోయినట్టు అర్జునుడికి ఇంకా తెలియదు. అతను కౌరవ పక్ష వీరులను చంపటంలో నిమగ్నుడై ఉన్నాడు. రెండో వైపునుంచి భీష్ముడు పాండవ సేనలను హడలగొట్టేస్తున్నాడు. భీముడూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ తమ పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నారు. ఈ అందరినీ మించి ద్రోణుడు యుద్ధం చేస్తున్నాడు.

ఇరావంతుడు చావటం చూసి, భీముడి కొడుకైన ఘటోత్కచుడు భయంకరమైన పెడబొబ్బ పెట్టి, భయంకరాకారంతో, చేతిలో ఒక మెరిసే శూలాన్ని పట్టుకుని, రాక్షసగణాలను వెంటబెట్టుకుని బయలు దేరాడు. అతన్ని చూసి, కౌరవసేనలు దడుచుకున్నాయి. అది చూసి దుర్యోధనుడు యుద్ధసన్నద్ధుడై, ఘటోత్కచుడికి ఎదురు వచ్చి, సింహనాదం చేశాడు. దుర్యోధనుడి వెనకగా వంగదేశపు రాజు పదివేల ఏనుగులతో వచ్చాడు. ఆ ఏనుగుల సేనను చూసే సరికి ఘటోత్కచుడికి మండిపోయింది. అతని రాక్షసులు ఏనుగులసేన మీద పడి ధ్వంసం చెయ్యసాగారు. గజయోధులు చస్తూ ఉండటం చూసి దుర్యోధనుడు బాణాలతో ఆ రాక్షసులను చంపనారంభించాడు. అప్పుడు ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి తానే ఎదుర్కొన్నాడు.

ఆ యుద్ధంలో బాగా గాయపడి రక్తం ఓడుతున్న ఘటోత్కచుడు దుర్యోధనుణ్ణి

## 58. ఘటోత్కచ భగదత్తుల పోరాటం



చంపటానికి ఒక గొప్ప శక్తిని చేతబట్టాడు. ఆ సమయంలో వంగదేశపురాజు తాను ఎక్కిన గొప్ప ఏనుగును దుర్యోధనుడి రథానికి అడ్డంగా తోలాడు. ఘటోత్కచుడు విసిరిన శక్తి తగిలి ఆ ఏనుగు కూలిపోయింది. వంగరాజు దాని మీదినుంచి దూకి, ఎటో పారిపోయాడు. తరవాత ఘటోత్కచుడు విజృంభించి, భయంకరంగా అరుస్తూ దుర్యోధనుణ్ణి పీడించసాగాడు.

ఘటోత్కచుడి పెడబొబ్బలు విని భీష్ముడు ద్రోణుడితో, "దుర్యోధనుణ్ణి ఘటోత్కచుడు పీడిస్తున్నట్టున్నాడు. వాణ్ణి చంపటం ఎవరికీ సాధ్యంకాదు. మీరంతా వెళ్ళి దుర్యోధనుణ్ణి రక్షించండి." అన్నాడు.

ఆ మాట వింటూనే, ద్రోణుడూ, సోమదత్తుడూ, బాహ్లికుడూ, సైంధవుడూ, కృపుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, బృహద్బలుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ, చిత్రసేనుడూ, వివింశతీ మొదలైన మహాయోధులు అనేక రథాలను వెంట బెట్టుకుని వెళ్ళేసరికి, ఘటోత్కచుడిచే తరమబడుతున్న దుర్యోధనుడు కనిపించాడు. వాళ్ళు ఘటోత్కచుడికి అడ్డుపడి యుద్ధం సాగించారు. ఘటోత్కచుడు తన వారితో ఆ యోధులందరినీ ఎదుర్కొని పోరాడాడు. అప్పుడు జరిగిన యుద్ధంలో మహా వీరులందరూ దెబ్బతిన్నారు. కొందరికి కవచాలు తూట్లు పడ్డాయి. కొందరు గాయపడ్డారు. కొందరి సారథులు చచ్చారు. మొత్తం మీద అందరూ యుద్ధవిముఖులయారు.

వెంటనే ఘటోత్కచుడు మళ్ళీ దుర్యోధనుడి పైకి వెళ్ళాడు. అప్పుడు మరికొందరు కౌరవపక్ష వీరులు ఘటోత్కచుడి పైన తలపడ్డారు. అతను వారితో యుద్ధంసాగించాడు.

ధర్మరాజు భీముడితో, "నీ కొడుకు ఘటోత్కచుడు తనకు మించిన యుద్ధం చేస్తున్నాడు. పాంచాలులను నిర్మూలించే ప్రయత్నంలో ఉన్న భీష్ముణ్ణి అర్జునుడు ఎదిరించి పోరాడుతున్నాడు," అన్నాడు. అర్జునుడికి సహాయంగా వెళ్ళటం కన్న ఘటోత్కచుడికి సహాయం చెయ్యటం

ఎక్కువ అవసరమని గ్రహించి భీముడు అతివేగంగా ఘటోత్కచుడి వద్దకు బయలు దేరాడు. అతని వెంట అభిమన్యుడూ, ఉప పాండవులూ, నీలుడూ, సత్యధృతీ, సౌచిత్తి, శ్రేణిమంతుడూ, వసుదానుడూ మొదలైనవారు వెళ్ళారు. ఉభయపక్ష వీరులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. యుద్ధంలో పాండవ పక్షానిదే పై చెయ్యి అయింది.



అది చూసి దుర్యోధనుడు భీముణ్ణి ఎదుర్కొన్నాడు. యుద్ధంలో భీముడు దెబ్బతిని, రథంలో కూలబడ్డాడు. అంతలో ఘటోత్కచుడూ, అభిమన్యుడూ మొదలైన పాండవవీరులు దుర్యోధనుణ్ణి చుట్టు ముట్టారు. దుర్యోధనుడు ప్రమాదంలో ఉండటం తెలిసి ద్రోణుడు అతనికి సహాయంగా కొందరు కౌరవవీరులను వెంట బెట్టుకుని వచ్చాడు. మళ్ళీ సాగిన యుద్ధంలో ఘటోత్కచుడు రాక్షసమాయలు ప్రయోగించి, శత్రువులకు దిగ్భ్రమ కలిగించాడు. ఘటోత్కచుడి దెబ్బకు తట్టుకోలేక కౌరవసైన్యాలు చెల్లాచెదరై, శిబిరాల కేసి పరిగెత్తసాగాయి.

అప్పుడు దుర్యోధనుడు భీష్ముడి వద్దకు వచ్చి, "తాతా, పాండవులు కృష్ణుణ్ణి నమ్ముకున్నట్టే మేము నిన్ను నమ్ముకుని యుద్ధం ప్రారంభించాం. ఘటోత్కచుడూ, భీముడూ చేరి నాకు గొప్ప అపజయం కలిగించారు. ఈ అవమానం నన్ను నిలువునా దహిస్తున్నది. ఎలాగైనా ఈ రాక్షసాధముడు చావాలి. ఈ ఉపకారం చేసిపెట్టు," అన్నాడు.

అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో, "నాయనా, నువు ధర్మరాజుతోగాని, భీముడితోగాని, అర్జునుడితోగాని, నకుల సహదేవులతోగాని యుద్ధం చెయ్యి. రాజు రాజుతో పోరాడటం రాజధర్మం. రాక్షసుడైన ఘటోత్కచుడితో పోరాడాలంటే మేమంతా ఉన్నాం. వాడితో యుద్ధం చెయ్యటానికి భగదత్తుణ్ణి పంపు. అతను ఇంద్రుడంతటి వాడు," అని భగదత్తుడితో, "నువు అనేక మంది రాక్షసులతో పోరాడిన



వాడివి. ఘటోత్కచుణ్ణి ప్రతిఘటించటానికి నువ్వే సరి అయినవాడివి. నువు ఇప్పుడే వెళ్ళి మేమంతా చూస్తూండగా వాణ్ణి చంపెయ్యి." అన్నాడు.

భీష్ముడు ఈ మాట అనేసరికి భగదత్తుడు సుప్రతీక మనే తన గొప్ప ఏనుగు నెక్కి, పాండవయోధుల మీద యుద్ధానికి వెళ్ళాడు. గొప్ప యుద్ధం జరిగింది. భగదత్తుడు భీముడితో తలపడ్డాడు. సుప్రతీకం అతివేగంగా భీముడి రథం మీదికి రావటం చూసి, కేకయులూ, ఉపపాండవులూ, అభిమన్యుడూ, దశార్ణరాజైన క్షత్రదేవుడూ, చేదిరాజైన చిత్రకేతుడూ ఆ ఏనుగుపై బాణాలవర్షం కురిపించారు. కాని సుప్రతీకం పాండవ సైన్యాన్ని ధ్వంసం చేయసాగింది. అది చూసి ఘటోత్కచుడు భగదత్తుడి మీదికి వచ్చాడు. భగదత్తుడు అందరినీ వరసగా చితకగొట్టేశాడు. భీముడి సారథి రథంలోనే మూర్ఛపోయాడు.

ఇంతలో అర్జునుడు భీమఘటోత్కచులున్న చోటికి వచ్చి యుద్ధం చేశాడు. భగదత్తుడు తన ఏనుగు చేత పాండవసైన్యాన్ని తొక్కిస్తూ వెళ్ళి, ధర్మరాజుతో యుద్ధం ప్రారంభించాడు.

ఆ సమయంలో, ఇరావంతుడు చనిపోయిన సంగతి భీముడికీ, అర్జునుడికీ తెలిసింది. అర్జునుడు చాలా బాధపడి, కృష్ణుడితో తన రథాన్ని కౌరవసేన మీదికి నడపమన్నాడు. మళ్ళీ ఉభయపక్షాల వీరుల మధ్య యుద్ధం ప్రజ్వలించింది. ఈ యుద్ధంలో భీముడు వ్యూఢోరస్కుణ్ణీ, కుండలి అనే వాణ్ణీ, అనాధృష్టీ, కుండభేదీ, వైరాటుడూ, దీర్ఘనేత్రుడూ, దీర్ఘబాహువూ, సుబాహువూ, కనకధ్వజుడూ అనే వాళ్ళను, ధృతరాష్ట్రుడి కొడుకులను వరసగా చంపాడు. అతను అలా వారిని చంపేటప్పుడు ద్రోణుడు అతని పైన శరపరంపరలు ప్రయోగించి కూడా అతన్ని ఆపలేకపోయాడు. చీకట్లు ముంచుకు వస్తూండగా, అలసిపోయిన ఉభయపక్షాల వారూ యుద్ధం చాలించి, శిబిరాలకు వెళ్ళిపోయారు.

అనంతరం దుర్యోధన, శకుని, దుశ్శా సనులు కర్ణుడితో కలిసి మంత్రాలోచన చేశారు. అప్పుడు దుర్యోధనుడు కర్ణుడితో, "భీష్ముడూ, ద్రోణుడూ, శల్యుడూ ఎందు చేతనో పాండవులను బాధించలేక పోతు న్నారు. పాండవులు అపజయమన్నది లేక మన సైన్యాన్ని నాశనం చేస్తున్నారు. రోజు రోజుకూ నా సేన తరిగిపోతున్నది. దేవుడూ, పాండవులూ కూడా నాకు పరాభవం కలి గిస్తున్నారు. నేను పాండవులను ఎలా జయిస్తానో తెలియకుండా ఉన్నది," అన్నాడు.



దానికి కర్ణుడు, "మహారాజా, భీష్ముడు యుద్ధం విరమించనీ. నేను వచ్చి పాండవు లను సోమకులతో సహా చంపేస్తాను. నా పరాక్రమం ఎలాటిదో భీష్ముడికి చూపు తాను. భీష్ముడికి పాండవుల మీద ప్రేమ, చూస్తూ చూస్తూ వారిని చంపడు, చంప లేడు కూడా. అందుచేత నువు వెంటనే భీష్ముడి శిబిరానికి వెళ్ళి, ఆయననూ అస్త్ర సన్యాసం చెయ్యమని చెప్పు. ఆయన ఆ పని చేసిన మరుక్షణం పాండవులు చచ్చారే అనుకో!" అన్నాడు.

దుర్యోధనుడు తన తమ్ములనూ, ఇతరు లనూ వెంటబెట్టుకుని భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, నీకు నా మీద కోపమో, లేక నా దురదృష్టమోగాని, నువు పాండవులను రక్షిస్తున్నావు. నీ ఉద్దేశం వారిని రక్షిం చటమే అయితే, యుద్ధం విరమించి, యుద్ధ భారం కర్ణుడి మీద ఉంచు. అతనూ, అతని బంధువులూ పాండవులను జయి స్తారు," అన్నాడు.

ఈ మాటలు భీష్ముడికి ములుకులలాగా తగిలాయి. ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి. ఆయన మూడు లోకాలనూ దహించే వాడి లాగా అయిపోయి, "దుర్యోధనా, ఇలాంటి మాటలు ఎందుకు అంటున్నావు? నా ప్రయ త్నంలో లోపం ఏమిటి? శత్రువులను అపారంగా నాశనం చేస్తున్నాను. అర్జునుడు మహా వీరుడని నీకు తెలియదా? నిన్ను గంధర్వులు పట్టుకు పోయినప్పుడు కర్ణుడు



ఏం చేశాడు? ఉత్తర గోగ్రహణ మప్పుడు అర్జునుడు మననందరినీ ఒంటిగా జయించ లేదా? అతను ఇంద్రుడికి లొంగని నివాత కవచులను జయించాడే! ఈ యుద్ధం నువు కోరి తెచ్చుకున్నది. నీ శత్రువును నువే చంపు, మేం చూసి ఆనందిస్తాం. నా మాటకు వస్తే, నేను శిఖండిని తప్ప మిగిలిన సోమ కులనూ, పాంచాలులనూ అందరినీ చంపుతాను, లేదా చచ్చిపోతాను. ఇంతకన్న నేను చెప్పేదేమీ లేదు. రేపు మహా యుద్ధం చెయ్యబోతున్నాను. ఇక నువు వెళ్ళి పడుకో," అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాటతో తృప్తి పడి, మర్నాడు నిద్ర లేస్తూనే తన పక్షాన పోరాడే రాజులతో, "ఇవాళ భీష్ముడు గొప్ప యుద్ధం చెయ్యబోతున్నాడు," అని చెప్పి, దుశ్శాసనుడితో, "ఇవాళ మనకు విజయం కలగబోతున్నది. భీష్ముణ్ణి మనం రక్షించుకోవాలి. అందుకు శకునీ, శల్యుడూ, కృపుడూ, ద్రోణుడూ, వివింశతీ సహాయపడాలి," అన్నాడు.

తొమ్మిదో రోజు యుద్ధం ఆరంభమయింది. భీష్ముడు సర్వతోభద్ర మనే వ్యూహంలో కౌరవ సేనలను నిలిపాడు. పాండవులు దానికి ప్రతి వ్యూహం పన్నారు. యుద్ధం ఆరంభమవుతూనే అభిమన్యుడు రెచ్చిపోయి, రెండో అర్జునుడిలాగా కౌరవసేనలనూ, సైంధవుడూ, కృపుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా లాటి మహా వీరులనూ చెదరగొట్టేశాడు. అప్పుడు దుర్యోధనుడు రాక్షసుడైన అలంబుసుణ్ణి అభిమన్యుడి మీదికి పురికొల్పాడు.

అభిమన్యుడికీ, అలంబుసుడికీ యుద్ధం జరిగింది. అలంబుసుడు గొప్ప యుద్ధమే చేశాడు గాని, అతను అభిమన్యుడి ధాటికి తట్టుకోలేక మాయా యుద్ధానికి దిగి, అందులోనూ నెగ్గలేక, చివరకు ఓడి పారిపోయాడు. తరవాత అభిమన్యుడు కౌరవ సేనను ధ్వంసం చేస్తూపోయాడు.

ఆ సమయంలో భీష్ముడు అభిమన్యుణ్ణి ఎదిరించాడు. అదే సమయంలో అర్జునుడు

కూడా అభిమన్యుడి వద్దకు వచ్చాడు. భీష్ముడి వెంట ఇంకా అనేక మంది మహా వీరులున్నారు. అలాగే అర్జునుడి వెంట కూడా ఉన్నారు. ఉభయ పక్షాలకూ గొప్ప యుద్ధం జరిగింది.

మరొక పక్క భీముడి పైకి భగదత్తుడూ, శ్రుతాయువూ ఏనుగుల సేనలతో వచ్చారు. భీముడు గద పట్టుకుని రథం నుంచి దిగి, తన చుట్టూ మూగిన ఏనుగులనూ, వాటి మీద ఉన్న యోధులనూ తన గదతో చావ బాదసాగాడు.

ఆ రోజు భీష్ముడు మహా దారుణమైన యుద్ధం చేశాడు. పాండవ సైన్యం విపరీతంగా నాశనమయింది. పాండవ సైనికులు అస్త్రాలు కూడా వదిలేసి పారిపోయారు. సూర్యాస్తమయం అయి యుద్ధం నిలిచిపోయింది.

భీష్ముడు విజృంభిస్తే ఎలా యుద్ధం చేయగలడో చూసిన పాండవులకు గుండెల్లో రాయి పడినట్టయింది. ధర్మరాజుకు యుద్ధం మీద విరక్తి కూడా కలిగింది. ఆయన కృష్ణుణ్ణి, ఏం చెయ్యాలని అడిగాడు.

కృష్ణుడు ధర్మరాజును ఓదార్చుతూ, "నువు దిగులుపడకు. భీష్ముణ్ణి అర్జునుడు చంపకపోతే, నేను చంపుతాను. భీష్ముడు చచ్చిపోతే నువు గెలవటానికి అడ్డు ఏదీ ఉండదు. నీ శత్రువు నా శత్రువే కద! తలుచుకుంటే అర్జునుడు భీష్ముణ్ణి తప్పక చంపగలడు. అది అతని కర్తవ్యం కూడా," అన్నాడు.

ఈ మాట విని ధర్మరాజు కృష్ణుడితో, "భీష్ముడు మా క్షేమం కోరినవాడు, మనం గెలవాలన్న కాంక్ష కలవాడు; మన పక్షాన యుద్ధం చెయ్యకపోయినా మనకు హితం చెబుతానన్నాడు. మనం ఆయన దగ్గిరికి పోయి, ఆయన ఎలా చస్తాడో అడుగుదాం. అటువంటి మహా పురుషుణ్ణి చంపుదామనుకుంటున్నాం గదా, క్షత్రియధర్మం ఎంత పాపిష్ఠిది!" అన్నాడు.

కృష్ణుడు ఈ మాటకు సంతోషించి, "భీష్ముడి వంటి మహా వీరుడు ఎలా చస్తాడో ఆయనే చెప్పాలి. మనం ఆయన వద్దకు పోదాం," అన్నాడు.





## 7

సాలెవాడి భార్య చేసినమాయ అంతా కళ్ళారా చూసిన దేవశర్మ తనలో, "ఆహా, స్త్రీలు ఎంత మాయలమారి వాళ్ళు! వాళ్ళ తెలివితేటల ముందు శుక్రుడూ, బృహస్పతీ ఎందుకు పనికి వస్తారు ?" అనుకున్నాడు

ఈ లోపల మంగలి స్త్రీ, తెగిపోయిన ముక్కును చేత బట్టుకుని, ఏం చెయ్యాలా, తెగిపోయిన ముక్కును ఎలా కప్పి పెట్టాలా అని ఆలోచిస్తూ ఇంటికి వెళ్ళింది.

ఇంతలో తెల్లవారింది. రాత్రి అంతా రాజభవనంలోనే ఉండిపోయిన దాని భర్త వచ్చి, "నా పొది ఇలా తీసుకు రావే," అన్నాడు. అసలే తెలివిగలది, ముక్కు తెగి పోవటంతో తెలివి రెట్టింపయిన మంగలిది ఒక్క మంగలి కత్తి మాత్రమే బయుటికి గిరవాటు వేసింది. పొది ఇయ్యమంటే ఒక్క కత్తి మాత్రమే పారేసిందని భార్య మీద మండిపడి, మంగలి ఆ కత్తిని ఆమె కేసి విసిరి కొట్టాడు. వెంటనే ఆమె చేతులు పైకెత్తి, "రక్షించండి! రక్షించండి! దుర్మార్గుడు, నా మొగుడు, నా ముక్కు కాస్తా కోసేశాడు!" అని కేకలు పెట్టింది.

ఆ కేకలు విని రక్షకభటులు పరిగెత్తుకుంటూవచ్చి, మంగలిని చావతన్ని, వాణ్ణీ, వాడి భార్యనూ, తెగిన ముక్కునూ తీసుకుపోయి న్యాయాధికారుల ముందు పెట్టి, "ఈ దుర్మార్గుడు ఈ స్త్రీరత్నాన్ని అకారణంగా హింసించాడు. వీడికి ఏ దండన విధిస్తారో విధించండి," అన్నారు.

న్యాయాధికారులు మంగలిని, "ఇలాటి ఘోరం ఎందుకు చేశావు? నీ భార్య ఏం చేసింది?" అని అడిగారు.

అట్ట చివరి బొమ్మ



మంగలి అసలే మూఢుడు, ఏమి జరిగినదీ వాడికీ అర్థం కాక, మౌనంగా ఉండిపోయాడు.

న్యాయాధికారులు శిక్షాస్మృతులన్నీ తిరగవేసి, మంగలికి మరణదండన విధించారు. మంగలిని వధ్యస్థానానికి తీసుకుపోయారు. దేవశర్మ ఈ సంగతి వినటమే గాక, వధ్యస్థానానికి పోతున్న మంగలిని చూశాడు. ఆయన న్యాయాధికారుల వద్దకు పరిగెత్తి వెళ్ళి, "అయ్యలారా, ఈ అమాయకుడైన మంగలిని అన్యాయంగా చంపబోతున్నారు. నిజం నేను చెబుతాను వినండి. అనవసరమైన విషయాలలో జోక్యం కలిగించుకుని నక్కా, నేనూ, మంగలిదీ ఆపదలు తెచ్చుకున్నాం," అన్నాడు.

"అది ఎలా జరిగింది?" అని న్యాయాధికారులు దేవశర్మను అడిగారు.

దేవశర్మ వారికి పోట్లాడుకున్న పొట్టేళ్ల కథా, తన బంగారం కాజేసిన ఆషాఢభూతి కథా, తప్పతాగిన సాలెవాడి కథా వివరంగా చెప్పాడు.

న్యాయాధికారులు దేవశర్మ చెప్పిన కథలను ఆశ్చర్యంతోనూ, ఉత్సాహంతోనూ విని, వెంటనే మంగలిని విడుదల చేశారు. కాని వారు మంగలి భార్యను విడిచి పెట్టక, ఆమె ముక్కు పోగొట్టుకుని కొంత శిక్ష అనుభవించింది కనక, ఆమె చెవులు కూడా కోయించి, ఆమె చేసిన దుర్మార్గానికి శిక్ష పూర్తిచేశారు.

నక్క పొందిన శిక్షా, మంగలిది పొందిన శిక్షా చూసిన మీదట దేవశర్మకు తన బంగారం పోయిందన్న విచారం పోయింది. ఆయన తన మఠానికి తిరిగి వచ్చి, శివుడి ముందర సాష్టాంగపడి, "మహాదేవా, నీ దయవల్ల మా ముగ్గురిలోనూ తక్కువ ఆపద పొందిన వాణ్ణి నేనే. రక్తదాహంతో నక్క తన ప్రాణాలనే పోగొట్టుకున్నది, మంగలిది ముక్కూ, చెవులూ పోగొట్టుకున్నది. నీ అనుగ్రహం చేత బంగారం మీది వ్యామోహంతో బంగా

రాన్ని మాత్రమే పోగొట్టుకున్నాను. ఇక దాన్ని కోరను," అన్నాడు....

దమనకం చెప్పిన దేవశర్మ కథ విని కరటకం, "సరే, మనం ఇప్పుడు ఏం చెయ్యాలి?" అని అడిగింది.

దానికి దమనకం, "తప్పు తోవలో పడి పోయిన మన రాజును సరి అయిన తోవకు మళ్ళించాలి. మన రాజు పింగళకానికి ఇప్పుడు సలహాదార్లు ఎవరూ లేరు. కేవలమూ ఎద్దు స్నేహాన్నీ, సలహానూ పురస్కరించుకుని మన రాజు గడ్డి తినే నీతి అవలంబించటం జరిగింది. ఆయనను అటు నుంచి మళ్ళించాలి," అన్నది.

"మన వంటి దుర్బలులకు అది ఎలా సాధ్యం?" అని కరటకం అడిగింది.

"దేహబలం చాలనప్పుడు యుక్తులు పని చేస్తాయి. భయంకరమైన పామును చంపటానికి ఆడకాకి బంగారు హారాన్ని ఉపయోగించలేదా?" అన్నది దమనకం.

"ఆ కథ ఏమిటి?" అని కరటకం అడిగింది.

దమనకం ఇలా చెప్పింది:

**పామును చంపిన కాకుల కథ**

ఒక ప్రాంతంలో ఒక పెద్ద మర్రిచెట్టు ఉండేది. దాని మీద ఒక కాకుల జంట నివసించేది. ఆ కాకులు పొదిగిన పిల్లలను ఒక పాము తిని పోసాగింది. చాలా



కాలంగా అదే చెట్టు మీద ఉంటున్న ఆ కాకులకు, పిల్లలు దక్కటం లేదన్న విచారం ఉన్నప్పటికీ, చెట్టును విడిచి పో బుద్ధికాలేదు.

పాము విడవకుండా చెట్టు ఎక్కి వచ్చి, రెక్కలు రాని కాకిపిల్లలను మింగేస్తూ ఉండటం చేత ఒక్క పిల్ల అయినా బతికి బట్టకట్టటం జరగలేదు. చిట్టచివరకు ఆడకాకి మగకాకి కాళ్ళపై పడి, "ప్రాణనాథా, దుష్టసర్పం మన పిల్లలందరినీ పొట్టబెట్టుకున్నది. మనకు పుట్టబోయే పిల్లల గతి కూడా ఇంతే అవుతుంది. అందుచేత మనం ఇంకెక్కడికైనా పోయి, దూరాన మరొక చెట్టు మీద నివాసం

ఏర్పాటు చేసుకుందాం. కన్న పిల్లల మీది ప్రేమా, వారు మరణిస్తే కలిగే శోకమూ ఇంతా అంతా కాదు. అందుచేత మనం వేరొక చోటికి పోదాం," అన్నది.

దానికి మగ కాకి, "ప్రియా, మనం ఎంతో కాలంగా ఈ చెట్టును ఆశ్రయించి ఉన్నాం. అందుచేత నాకు దీన్ని వదిలి పెట్టటం ఇష్టం లేదు. పిడికెడు గడ్డీ, పుడిసెడు నీరూ మాత్రమే కోరే లేడి ఎక్కడైనా బతకగలదు; కాని అది ఎన్ని అపాయాలకైనా ఓర్చి తన జన్మస్థానమైన అరణ్యంలోనే ఉంటుంది. లేడి కూడా చెయ్యని పని, తెలివితేటలు గల కాకులం చెయ్యటమా? ఏదో ఒక ఉపాయం చేత నేనీ పాపిష్ఠి పామును చంపేస్తాను," అన్నది.

"అది విషసర్పం. దాన్ని ఎలా చంపుతావు?" అని ఆడకాకి అడిగింది.

"నేను స్వయంగా ఆ పని చెయ్యలేక పోతే నేం? ధర్మశాస్త్రమూ, రాజనీతి తెలిసిన ఉద్దండ పండితులు, నాకు మిత్రులు ఉన్నారు. నేను వారితో సంప్రతించి, వారి సలహా పొంది, శీఘ్రమే ఈ పామును చంపేస్తాను," అన్నది మగ కాకి.

అది రోషంతో ఎగిరి పోయి మరొక చెట్టును చేరి, అక్కడ నివసించే తన ఆప్తమిత్రుడైన నక్కను పిలిచి, తనకు వచ్చిన కష్టం చెప్పుకుని, "మిత్రమా, మా పిల్లలనన్నిటినీ పొట్టన పెట్టుకున్న దుర్మార్గపు పామును చంపటానికి మంచి ఉపాయం ఉంటే చెప్పు," అన్నది.

దానికి నక్క, "నేనొక చక్కని ఉపాయం ఆలోచించాను. ఇక నీ కష్టాలు గట్టెక్కుతాయి. చెడ్డపనులు చేసేవారు, నది ఒడ్డున ఉన్న చెట్టులాగా తమకు తామే నాశనమైపోతారు. వెనకటికి కొంగ చేపలన్నిటినీ తిని కూడా తృప్తి తీరక చివరకు ఎండ్రకాయ చేత చావలేదా?" అన్నది.

"ఏమిటా కథ?" అని మగ కాకి అడిగింది.



# 145. ఇంగ్కా దేవాలయం

దక్షిణ పెరూలో, ఆండీపర్వతాల మధ్య ఇంగ్కా జాతి ఎర్రఇండియన్ తెగలవారు ఉండేవారు. స్పానిష్ వారు తమను జయించినప్పుడు ఎర్రఇండియన్‌లు అరణ్యాలుపట్టి పోయారు. బొమ్మలో ఉన్నది వారి దేవాలయం.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఊరికి ఉపకారి

పంపినవారు :
జి. పాపయ్య

Photo by Anant Desai



వీరన్నపేట.
మహబూబ్‌నగర్.

చెరువుకు సేనాని

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జనవరి నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మార్చి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
పొంగలిపండగ వచ్చింది

మూడవ అట్ట:
చెరుకుగడలు తింటున్నారు

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

